వీరబ్రహ్మము, శ్రీరామ్

జపానీయము

మచిలీపట్టణము, 1910

Record no. 153

Vīrabrahmamu, Śrīrām

Japānīyamu

Macilīpaṭṭaṇamu, 1910

Record no. 153

## Bibliographic Record Target

వీరబ్రహ్మము, శ్రీరామ్.
జపానీయము / గ్రంథకర్త శ్రీరామ్ వీరబ్రహ్మము. - మచిలీపట్టణము : సేతు ముద్రాక్షరశాల, 1910.
7, (2), 99 p. ;20 cm.
Record no. 153

Vīrabrahmamu, Śrīrām.
Japānīyamu / granthakarta Śrīrām Vīrabrahmamu. - Macilīpaṭṭaṇamu : Sētu Mudrākṣaraśāla, 1910.
7, (2), 99 p. ;20 cm.
Record no. 153

# జపానీయము.

చంద్రికాంతనాటకాది గ్రంథకర్తయగు

శ్రీరామ్ వీరబ్రహ్మము గారిచే

రచియింపఁబడియె.



మచిలీపట్టణము

సేతు ముద్రాక్షరశాలయందు

సి. సేతుమాధవరావుచే

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1910.

 వెల 12 అణాలు 

# జపానీయము.

## పండితాభిప్రాయములు.

కె. వి. లక్ష్మణరావు, యమ్. ఏ., దివాన్ ఆఫ్ మునగాల యెస్టేట్ అండ్ ఎడిటర్ ఆఫ్ విజ్ఞానచంద్రికా గ్రంథమాల గారిట్లనుగ్రహించిరి.

మ. రా. రా. శ్రీరామ్ వీరబ్రహ్మముగారిచే రచియింపఁబడిన జపానీయ మను నాటకము నందలి కొన్నిరంగములను చదివి చూచినాఁడను. రుష్యావారికిని జపానువారికిని కొన్ని సంవత్సరములక్రిందట జరిగిన మహాయుద్ధమీనాటకము యొక్క విశేషము. ఇప్పటి కాలమందు పెక్కునాటకములు వెలువడుచున్నను దేశచరిత్రములకు సంబంధించినవి మిక్కిలితక్కువగనున్నవి. ఆలోపమునివారించుటకై రాజశ్రీ వీరబ్రహ్మముగారు ఈనాటకమునువ్రాసియున్నారు. కావున వా రాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులు. నాటకముయొక్క శైలిఁ నేఁ జూచినంతవఱకు మృదుమధురముగనే యున్నది.

మదరాసు, 8—1—10.

శ్రీ పోలవరము సంస్థానాస్థాన విద్వాంసులును కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంకితులును శతావధానులును విద్వద్గరిష్ఠులును అగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు వారి యభిప్రాయమిట్లు దయచేసిరి.

మీరు రచించిన నాటక<br>
మారంగాఁ జూచినార మచ్చటచట నో<br>
శ్రీరామ్ వీరబ్రహ్మక<br>
వీ రసవంతంబు సుకవి వినుతం బరయన్ ॥

తే॥గీ॥కథ పురాణప్రసిద్ధంబు కాక యుంట
పూర్వులెవ్వరు రచియింపఁ బూనకుంట
నాటకమునందు రసముఁ గన్పఱచుటన్న
కష్ట మటుగాక రసమిందుఁ గానఁబడెడు॥

కం॥ జాపానీయచరిత్రము
రూపకముగఁ జేసి ధీవరులఁ దనియింపన్
జూపించిన మీమతి యు
ద్దీపితమగు గాత మితరదేశ చరితకున్॥

కం॥ పదములగుం పుచితరసా
స్పదమగు సందర్భశైలి సరసులు మెచ్చన్
బొదలెడు భావము వెలసెం
గద జాపానీయ నాటకంబున బళిరే!॥

కం॥ ఇఁక నేతాదృశాపూ
ర్వక నాటకముల్ రచించి విమల యశఃక
న్యకఁ బెంచుము వీరబ్ర
హ్మకవీ! వర్ధిల్లుమయ్య యార్యులు వొగడన్॥

---

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నృగ చరిత్రాది గ్రంథకర్తలగు మ.రా.రా. అబ్బరాజు హనుమంతరావు గారిట్లు వ్రాసిరి.

కం॥ శ్రీరామన్వయఖేనా
వీరబ్రహ్మాభిధాన వినయనిధానా
ఈరల 'జాపానీయము'
నారసి కన్గొంటి నే మహానందముతో॥

తే॥గీ॥ అచ్చటచ్చటఁ గాంచినయట్టి గద్య
పద్య రచనయె యెంతయో హృద్యముగను



నుండెఁ బుస్తకమంతయు నొప్పఁ గులుకు
చుండె నటకు వింత యేముండు ననఘ!॥

కం॥ కొందఱికి గద్యమిడు రుచి
కొందఱికిం బద్యము రుచిఁ గూర్చుఁ జెవులకున్
గొందఱికి రెండు రుచినిడు
నందఱికిని రుచినొసంగు నది యిది యొకటే॥

తే॥గీ॥ పొసఁగు పద్యముల్ ముద్దులు మూటగట్టు
నెసఁగు గద్యములను గారు రసముబట్టు
కొసరుదురు పద్యముల్వీను రసికులెట్టు
విసువ కింకొక పరిఁ బల్కుఁడెసఁగు నట్టు॥

---

**M. R. Ry. V. Ramadasu Pantulu Garu B. A. B. L., High Court Vakil, Secretary of the Andhrabhashabhivardhani Sangham Ltd., Masulipatam, & President of the Chatrapur Jaganmohan Theatre, Masulipatam, writes:--**

I have read with great pleasure the original Telugu Drama entitled the "**Japaneeyamu**" by Mr. Sreeram Veerabrahmam of Masulipatam. It is written in easy and charming Telugu. The verses are well written. The story is well told. This is one of the few first attempts at dramatising Modern History and deserves encouragement at the hands of all those that are interested in the advancement of the Telugu Literature. The Drama is so written as to please not only the scholars but also the actors. It is well suited to the stage. I hope that the reception that will be given to this work will be such as to encourage the author to attempt more works of this description.

# అవతారిక.

శా॥ శ్రీవాణీశపురందరాది విబుధుల్ సేవింపఁగా నంజనా
దేవీ దుర్భరగర్భ భారమును విస్తీర్ణాను కంపామతిన్
వే వారించియు గర్భమందె శిశు కౌపీనాదులంగోరి సం
భావింపంగ నొసంగు విశ్వపతి రామబ్రహ్మము బ్రోచుతన్ ॥

శా॥ శ్రీకాత్యాయని వేణిఁ గాంచి ఫణిగాఁ జెల్వొంద భావించి లో
వీకన్భీతిని జెందు శీతకిరణున్ వీక్షించి తద్భీతి న
స్తోకప్రౌఢిమ మొప్పఁ బాపు మిషచేఁ జూడస్థ గంగాత్మదృ
గ్లోకం బాపుచుఁ బెండిలౌ శివుఁడిడు న్గార్గల్గృతి స్వామికిన్ ॥

మ॥ ఘన కంఠీరవ వాహనంబుఁ గనునంత ధైర్యమున్వీడి సం
జనితోదగ్రి భయప్రకంపిత తనూజాతున్ న్గజాస్యున్మదం
బున నంకస్థలవాసుఁ జేసి మిగుల న్సద్దాడు శ్రీగౌరి ప్రే
మను శుంభచ్ఛుభ మిచ్చి ప్రోచెడిని రామబ్రహ్మ యాచార్యునిన్ ॥

సీ॥ కాలాహి ఘనవిష జ్వాలదంష్ట్రాళిచే విడువక చవిచూడఁ బడుచునున్న
నొకసారి పెంపు నింకొకసారి క్షీణత్వ మందుచు దోషాకరాహ్వయమున
వెలయుచున్నను భవత్ప్రియ సోదరుండైన కారణంబున గదా కర్మసాక్షి
మూర్తిత్రయుఁడు సురముఖ్యుఁడునగు లోకబాంధవునకు సరిపఱచియిటుల

తే॥గీ॥ నేత్రయుగముగ నిరువుర నిలిపినాఁడ
ననుచు శ్రీదేవి పాలయల్క నను నయించు
నచ్యుతుం డజస్రముఁ గామితార్థ మొసఁగి
మనుచుఁ గాత రామబ్రహ్మ మాన్య చరితు ॥

మ॥ హరి వక్షస్థల కౌస్తుభాఖ్యమణియం దాత్మీయ రూపంబునున్
బరగం గాంచి మఱొక్క కాంతయని తా భావించి పేరల్క నే



మఱపాటొందక యందె నిల్చెసిరి రామబ్రహ్మ యాచార్య ధీ
వరు గేహాంతరవాసియై నిరతము న్వర్తిల్లు గొల్లూరునన్ ॥

శా॥ చాతుర్వక్త్రి కృతాను చుంబన లసచ్ఛ్మశ్రుద్గమాత్మీయశ
క్త్యాతీతంబని యెంచి లోఁగు నెడ ముగ్ధాబ్జానన భ్రాంతి నే
ఖ్యాతబ్రహ్మము కౌఁగిలించు నల వాక్కాంత న్సదా యట్టి ని
ర్మాతప్రాభవుఁ డాయురున్నతుల రామబ్రహ్మము న్గావుతన్ ॥

సీ॥ ఉపమానశూన్యనిమ్నోన్నతిఁ దనరారు భూరినీరధిచాయ బుద్ధిగాఁగ
కటికిచీఁకటివోలె కడునల్లనై మించు లలితాంజనాద్రి కజ్జలముగాఁగ
మత్కృతీశ్వరు వినిర్మలకీర్తి ధవళిత ధాత్రీతలంబు పత్రంబుగాఁగ
అఖిలార్థదాయియై యలరారు కల్పశశ్వచ్ఛాఖలేఖినీ వరముగాఁగ

తేఁగీ॥ సుప్రథిత విశ్వకర్మ కథాప్రపంచ
మతులనైపుణ్య వర్ణనాఢ్యంబుగాఁగ
వ్రాయుచునువాణియనున్న యవ్వాణిపేర్మి
నలరుఁగాక రామబ్రహ్మ యార్యజిహ్వ ॥

తే॥గీ॥ విబుధులుపయోధి మథియించు వేళ యెవని
మ్రొక్కి చింతామణీ కల్పభూజకామ
ధేనువుల నొందిరో యట్టి దేవుఁ దలఁతు
శ్రీవినాయకు మదభీష్ట సిద్ధికొఱకు ॥

సీ॥ అమవసనాఁడు పున్నమయంచుఁ బలికి శీతాంశుని జూపింతు ననియె నెవఁడు
శాంబరీ విద్య లసత్స్వర్త్య కాంతయనా యజునిరాణిని సున్నమడిగె నెవఁడు
రమ్యోపమాన సారసమృదుశయ్యాన్విత పదసంఘటనకు దక్షుఁ డెవఁడు
మండితోలగమందు పండితాగ్రణులెల్ల వినజగద్గురుఁడ నే ననియె నెవఁడు

తే॥గీ॥ జగతినట్టి గీర్వాణీ పరిసన్నులై వి
భాసిత చరిత్రులగు కాళిదాసదండి

మాఘరుద్ర సత్కృవుల వేమారుఁదలఁతు
సారమతి మదభీష్ట మీడేరుకొఱకు॥

కం॥ ఎల్లరుఁదని పెడిగతిఁ గవి
తల్లజులే కృతుల నల్లఁదగమని యన నే
నెల్లరఁ దనుపం గలనా!
యెల్లరుఁ గరుణార్ద్రదృష్టి నీక్షింపనిచోఁ॥

వ॥ అని యిష్టదేవతాప్రార్థన సుకవిప్రకరాభివాదనాదు లొనర్చి యొక
నవీనగ్రంథ రచనాభిరతి నున్న సమయంబున.

షోడశదళ పద్మబంధ సీసపద్యము.

ఉపమానశూన్యత నురుతర నుతగుణ శాలియై దీపించు సద్యశుండు
పాతకమూరాఖ్యరమ్యత సుప్రథిత వంశ లలితాంబురాశి కళాప్రదాత
అరయ యాచక సమూహము పాలికల్పమై భూరి సత్కీర్తిచేఁ బొరలుమూర్తి
శైలరాడ్ధరు పదాబ్జాతార్చన మహిత భక్తి నిరత సుహృద్వ్యాప్తిఁ బ్రబలు

తే॥గీ॥ ఘనుఁడనఁగ బ్రహ్మకులజుఁడై కరము వెలుఁగు
సముచిత విభవములు ననేకములు దనరఁ
గవుల నుతులు సత్యములయి కడఁగగాను
కవరులు రమేశుఁడు విధాతగా నుతింప॥

అట్టి రామబ్రహ్మ యాచార్యుఁడు కృష్ణాగుంటూరు మండల తృతీయ విశ్వ
బ్రాహ్మణ మహాజనసభా కార్యానంతరంబున నన్నవలోకించి

తే॥ గీ॥ శ్రీవిరాట్ప్రభు శతకంబు దైవభక్తిఁ
గొలుపు మార్కండు చరితంబు లలిత ఫణితి
రత్నమాలా విలాసంబు రమ్యమగు జ
పాన్చరితాది గ్రంథముల్ వ్రాసియుందు॥

కం॥ కొన్నిఁటి నచ్చొత్తించితి
వెన్నఁగ నికఁ గొన్నియున్న విపుడచ్చున కో



సన్నుత! మదంకితంబుగఁ
గ్రన్నన నందొక్కదానిఁ గావింపుమయా॥
అని సగౌరవంబుగఁ జేరేప నిట్టికార్యభారంబున కే నెంతయు నసమర్థుండ
నయ్యుఁ దత్ప్రేరణం బుల్లంఘింపఁజాలక యందులకియ్యకొని

సీ॥ మందార కుందార విందమందాకినీ సందోహ సుషమాల సద్యశుండు
నీహారగిరిజామనోహరు దివ్యపాదాంభోజ యుగళార్చనాభిరతుఁడు
పురుహూతునింబోలె బోగభాగ్యాన్విత ప్రకటితైశ్వర్య విభాసితుండు
నిస్తులధార్మిక నియతిచే నిజసంఘ సంస్కరణోద్యోగ సన్నుతుండు

తే॥గీ॥ నగుచు నిరతంబు సద్గోష్ఠి నభిలషించు
నురుతురాసక్తి బుధుల బహూకరించి
నలరునట్టి రామబ్రహ్మయార్య కంకి
తముగ రచియించినాఁడ నిద్దాని వేడ్క॥

గొడుగుపేట,
మచిలీపట్టణము.

ఇట్లు విధేయుఁడు,
శ్రీరామ్ వీరబ్రహ్మము.



# ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

సూత్రధారుఁడు

పారిపార్శ్వకుఁడు

రుష్యాచక్రవర్తి 1. అం. 1, రం. III. అం. 5. రం.

చారులు I. అం. 1- రం.

వాచాలుఁడు I అం. 1 రం, 2 రం II అం. 3 రం. V అం. 2 రం.

పాంచాలుఁడు I అం. 1రం2 రం. II అంకము 3 రం. V అం. 2 రం.

2 బాక్సరులు I అం. 2 రం.

జపాన్చక్రవర్తి I అం. 3 రం. V అం. 3 రం.

రాయభారులు I అం. 3 రం.

భర్త II అం. 1 రం.

భార్య II అం 1 రం.

మిత్రుఁడు II అం. 2 రం

వీరమాత II అం. 2 రం.

ధైర్యశాలి II అం. 2 రం.

సిరిల్ II అం. 3 రం.

కురోకి II అం. 3 రం.

ఓకు II అం. 3 రం.

సభాపతి III అం. 1 రం.

ప్రభు పుత్రుఁడు III అం. 1 రం.

పతివ్రతIII అం. 1 రం.

అడ్మిరల్ టోగో III అం. 2 రం. V అం. 3 రం.

జనరల్ నోగి III అం. 2 రం.

స్టాసల్ III అం. 2 రం.

విదేశ సముద్రసేనాధిపతి III అం. 2 రం.

వీరపత్ని III అం. 2 రం.

సేవకుఁడు III అం. 3 రం.

ఒయాము III అం. 3 రం. V అం. 3 రం.

సన్యాసులు III అం. 4 రం. 5 రం.

జయదాస్ IV అం. 1, 2 రం.

జయరామ్ IV అం. 1, 2 రం.

జయసింగ్ IV అం. 1 రం. 2 రం.

,, V అం. 1 రం.

కమల IV అం. 2 రం.

క్యారోప్యాట్కిన్ V అం. 1 రం. 3రం.

స్టాకల్బర్గు V అం. 1 రం. 3రం.

ఉపసేనాధిపతి V అం. 1, రం. 3 రం.

ఓగు V అం. 1 రం. 3రం.

**N. B.**—ఇంకను సందర్భానుసారముగ మఱికొన్ని పాత్రలు వచ్చును. పాత్రిలసంఖ్య లెక్కకెక్కువగ నుండినను నాలుగైదుపాత్రలు దక్క తక్కిన వన్నియు నొక్కొక్క రంగమునందే వచ్చుచుండుఁ గాన ప్రదర్శనమునం దెక్కువ కష్టముండఁజాలదు.





శ్రీరస్తు.

# జపానీయము.

## నాంది.

శా॥ శ్రీరాజిల్ల నమూల్యరత్నఖనుల న్జెన్నారు సస్యాదులన్
శూరాగ్రేసరుల న్సుధీవరుల నస్తోక ప్రతాపాన్వితో
దారస్వాంతుల నీనుచున్ నిరతము న్దాక్షిణ్య భావంబు చే
కూఱ న్భాసిలు లోకమాత మిగులన్గూర్మి న్మిముద్బ్రోచుతన్॥

సీ॥ పూతహరిశ్చంద్ర ముఖ్యులౌ షట్చక్రవర్తుల జగదేకకీర్తిపరుల
అరయఁగ నంబరీషాదిషోడశమహారాజన్యులను ధర్మరాజముఖుల
విక్రమార్కాది సద్విక్రమచరితుల రాజనరేంద్రాది రాజవరులఁ
జంద్రగుప్తాశోక జనపతిప్రముఖుల ధీనిధి శ్రీకృష్ణదేవరాయ

తే॥గీ॥ లాదిగాఁగల సర్వంసహాధిపతులఁ
గనిన కరుణాసమేత విఖ్యాతచరిత
లోకమాత మిముం గృపాలోకనములఁ
గాంచి మీకోర్కులొసఁగి రక్షించుగాత॥

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు (ప్రవేశించి తెఱవంకఁజూచి) పారిపార్శ్వకా! ఇదిగో వచ్చెదనని

చెప్పి యింతదనుక రాక కార్యసమయములందు సైతము జాగొనరించు చుంటివికద్దా.

పారి.— (ప్రవేశించి) ఆర్యా! ప్రకృత కర్తవ్య కార్యాచరణ పరాయణత్వంబున నించుక యాలస్యంబయ్యె నందులకు మన్నించి నన్ను రప్పించిన కారణం బెఱింగింతురుగాక.

సూత్ర.— ఎఱింగించుటకేమున్నది! ఇటు చూడుము, ఈరంగస్థలం బిట్లలంకరింపఁ బడి యుండుటకు నీ సభాస్తారు లిట్లతికుతూహలాయమానమానసులగుటకుఁ గారణంబు వినియే యుంటివిగదా!

పారి.— (ఆనందముతో) ఆ! వింటిని. ఈరంగస్థలమధ్యస్థుండవైన నీవును నీసభా స్తారులునుఁ గాక నేనును వింటిని.

సూత్ర.— (చిరునవ్వుతో) దేనిని?

పారి.— ఇప్పు డిచ్చటనుండి కర్ణాకర్ణికగా వినవచ్చిన రెండు నూతన పద్యంబులును.

సూత్రి.— అవియా నీవువిన్నవి! అయినను నూతననాటకము ప్రదర్శింపఁబడుఁ గాన నూతనపద్యములు వినవచ్చినవి. నాటకము నూతనమై పద్యములు పురాతనముగ నుండునా?

పారి.— అవునవును. ఇప్పుడు ప్రదర్శింపఁబడు యానవీననాటక మెద్ది?

సూత్రి.— జపానీయము.

పారి.— దాని నెవరు రచించిరి?

సూత్ర.—

కం॥ శ్రీరామన్నయతిలకుఁడు
భూరియశుఁడు గంగయాఖ్య పుత్రుఁడునగు నా



పారి.— (ఆకసమువంకఁ జూచి యాలోచించి) పొరబాటు! పొరబాటు!

సూత్రి.—

వీరబ్రహ్మాభిఖ్యుఁడు
ధారుణి రచియించె మృదుసుధామయ ఫణితిక్॥

పారి.—హీ, హీ, హీ, హీ, (అని నవ్వును)

సూత్ర.— ఏమిది? ఇట్లు పరిహాసముఁ జేసెదవు!

పారి.— ఏమియు లేదు. ఏదియో యొక నూతననాటకము ప్రదర్శింపఁబడునని వ్రాకుచ్చి తుదకు చంద్రకాంతలోని తద్గ్రంథకర్తగారి పేరిటి పద్యంబుఁ జదివినందునకు నాకు నవ్వుతోఁచి యిట్లొనర్చితి.

సూత్ర.— ఓయి యవివేకగ్రామణీ! ఇదియా నీ మేలంబునకు కారణంబు! చంద్ర కాంతనాటకమును రచించినవారె యీనాటకమును రచించిరి కనుక నందలి పద్యంబుఁ జదివితిని; పోనిమ్ము మఱియొండు పద్యంబుఁ జదివెద.

సీ॥ విశ్వవిశ్వాఖ్యాత విశ్వకర్మాభిఖ్య పంచాననోద్భవ ప్రథితులెవరు
సూరిజనస్తుతాంగీరసగోత్ర పవిత్రులై వసుమతి వెలసిరెవరు
రమణీయమైనశ్రీరామన్న వాయదుగ్ధాబ్ధిరాకాతుహినాంశులెవరు
నిగమపారాయణ నియతులై తగు గంగయాచార్యతనయులై
యమరిరెవరు

తే॥గీ॥ మేటిచంద్రకాంతాభిఖ్య నాటకము ర
చించి యతులసత్కీర్తి వహించిరెవ్వ
రట్టి యల్లవీరబ్రహ్మ యార్యులీ జ
పాన్చరిత్ర రచించిరి భవ్యఫణితి॥

ఇటుల రచించి ప్రదర్శింప మన కొసఁగిరి.

పారి.— బాగు! బాగు! ఇప్పుడెల్లసంగతులు విశదమైనవి. సంతోషము! కాని యింకొక చిన్నసందియము కలదు.

సూత్రి.— ఏదది?

పారి.— మనకే యొసంగితి రంటిరే! మనకనగా నీకా? నాకా?

సూత్ర.— ఓయి సామరుఁడా!

పారి.— ప్రథమాక్షరము తీసివేసిన నే నందునకే తగుదును. (అని యొడలఁ జూచుకొని సంతోషించును.)

సూత్ర.— మరుఁడా యని పిలువుమందువా! ఔరా! నీ వంతటి చక్కనివాఁడవా! ఇఁక నీసందియంబుఁ దీర్చెదవినుము. భగవత్సంబంధమగు గాథలఁగాని మహాపురుష చరిత్రంబులఁగాని ప్రదర్శించి తన్మూలంబున లోకంబున ధర్మాధర్మంబులఁ బ్రకటించుకొఱకు నాటకసంఘంబు లేర్పడినవి కాని నిజోదర పోషణార్థంబుకావు. కనుక నాటక సాంఘికు లెల్లరుఁ దీనిఁ బడయునగును. కాని పారిపార్శ్వకుఁడవగు నీ విద్దానిం బడసి నీలోనీవు సంతసింపుచు "పుస్తకం హస్తభూషణం" అనువాక్యంబును సార్థక పఱచుటకుఁగాక యింకేమి సేయఁగలవు!

పారి.— నా సంతోషము. నాక్షేమముకన్న నాకితరంబులేల?

సూత్ర.— కుత్సితధీమణీ! నీకు దేశాచారములం దాదరణ ముండుపక్షమున నీ విటుల నుడువవు. కావున నేఁడీ ప్రదర్శనంబునఁ జేర్కొనఁబడు మహాపురుషులెట్టి యసమానకృత్యంబుల నెరవేర్చిరో మానవజన్మసార్థకంబులగు యభిమానైక మత్యాయుల నెట్లువిశదీకరించిరో నీ వీ ప్రోలనుండి సాంగోపాంగముగ నవలోకింపుము.

పారి.— అటులైన నిపుడు జరుగఁబోవు చిత్రోదంత మేమి?



సూత్ర.— ఇపుడు రుష్యాకోర్టు ప్రదర్శింపఁబడును. అదిగో మన చంద్రుఁడు తాను రుష్యాచక్రవర్తి యైనందున కానందించుచు మన మొనర్చు కాలహరణంబునకుఁ దన విసువుఁదనముఁ జూపుచు నట్లే మనవంకఁ జూచుచున్నాఁడు. ఇఁక నాలస్యంబుఁ జేయఁదగదు. (సభవంకఁజూచి) ఆర్యులారా! ఈనాటకారంభమం దీ గ్రంథకర్త తన మనవిగా నుడువ మాకిట్లని యానతిడియె. ఏమనిన—

చం॥ ఇది మనప్రాక్పురాణముల నింపుగ భాసిలు గాథకాదు నేఁ
జదివిన విద్యఁజూడ నొకశాస్త్రమునం దొకపఙ్క్తియైననున్
వెదకినఁ గానరాదు మఱివింతయె లోపము లుంట! గాన నిం-
దొదవెడు తప్పుల న్సయిచి యొప్పులకు న్ప్రమదంబుఁ జెందుఁడీ॥

పారి.— భరతపుత్రా! ఇది యొకప్రబంధమందలి కథ కాదంటివే! మఱియెచ్చటిది?

సూత్ర.— ఓయి అనిశసంశయాకులచిత్త! ఆంధ్రభాషలో వచనమున మహారాజశ్రీ ఆదిపూడి సోమనాథకవి ప్రణీతమగు యొక చరిత్ర ననుసరించి యీకవి నాటకరూపంబుగ రచించె. మఱియు,

సీ॥ పౌతకమూరన్వయాంభోధి సుధాంశుఁడౌ రామయాచార్యుఁ డే రమణుతాత
అసమానధర్మకర్మాభిరతుండైన కోటయాచార్యుఁడే మేటితండ్రి
విమలగుణాఢ్యులై వెలయు రామయ నాగయాచార్యులెవ్వాని యనుజవరులు
విస్ఫురదాఖ్య పవిత్ర సుపర్ణసగోత్రమే సుచరిత్రు గోత్రవరము

తే॥గీ॥ గరిమ పిచ్చమాంబ యెవనిఁగన్నతల్లి
అనుపమాన రామబ్రహ్మయార్యులను శు
భాక్షరంబు లెవ్వాని యాహ్వయమునందు
గ్రాలుఁనట్టి ఘనుఁడు కృతికర్తయయ్యె॥

అద్దాని నిపుడు ప్రదర్శింపఁదలఁచితిఁగాన నీకజాగు సేయరాదు. ఈసభ్యులు తడవున కిచ్చగింపరు. కావున నేఁబోయి పరిదర్శనాభిరతినుండెద. మఱియు

శా॥ జాపానుల్గపటంబునన్మెలఁగు రుష్యావారి కృత్యంబులన్
సైపన్జాలక వైరులంగొలువ నైచ్యంబంచు నూహించి లోఁ
గోపాటోపము మీఱ శౌర్యమును శక్తుల్ యుక్తిధైర్యాదులన్
జూపన్వేడ్కఁ జరించు చంద మరెరే చోద్యంబుగాదే! కనన్॥

తే॥గీ॥ బెట్టిదంబగు పౌరుల పట్టుఁదలయుఁ
బౌరులెల్లరు నిజరాజ భక్తినెల్ల
వెల్లిగొల్పఁ జరించిన విధము బళిరె
కాంచువారిని హర్షాబ్ధి ముంచకున్నె!॥

కావున నీవును దద్విలోకనాభిరతి నుండుము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



# జపానీయము.

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము.

రుష్యా కోర్టు; చక్రవర్తి, 1, 2, అధిపులు ప్రవేశము.

చక్ర.—సభ్యులారా; నానావిధ సమీపదేశస్థవణిగ్వరుల వ్యాపారంబుల కపారతర సుఖకరంబై, యశేష సారభూరుహప్రకర సాంద్రంబై, జగద్ధితంబై, వెలయు కొరియాను వర్ణింప నేరుప నేర్పరులు కాఁజాలరుగదా! ఏలన

సీ॥ శ్రీరమ్యతరమయి భూరిభూరుహతతి చేతనీక్షితిలోనఁ జెలఁగుచుండె
నిడుదలై వెడదలై నిమ్నతరంబులౌ వాహినీవ్రజము చేవఱలుచుండె
నరయఁగ రేవులకన్నిటి కంటె నుత్తమమైన రేవయి తనరుచుండెఁ
బేటలచేఁగొప్ప కోటలచేఁగడు మేటిసాటియులేక మెలఁగుచుండె

తే॥గీ॥ సన్నుతింప వాణిజ్యంబు సలుపమిగులఁ
దగినదై యోగ్య జీవనాధారమగుచు
మాననీయమై ప్రాణ సమానమగుచుఁ
బరగు కొరియాను వర్ణింపఁ దరమె మనకు॥

1అధి.—అవునవును. ఆకొరియా తమస్వాధీనంబునకుఁ దెచ్చుకొనఁ బెద్దకాలంబునుండి చైనావారు ప్రయత్నించుచుండిరి.

చక్ర.—

కం॥ చైనావారేగాక, జ
పానుమహీశులును కొరియ బాగుగఁ దమస్వా

దీనతఁ గనుటకు మిక్కిలి
పూనికచేఁ బాటుపడుట మును వినలేదే॥

అదియట్లుంచుము, మనసంగతిఁ జూడ

తే॥గీ॥ రేవులు సిబేరియాలోన లేవటంచు
వేగ, కొరియాకుపైన సిబేరియాకు
క్రిందఁగల సముద్రప్రాంతమందు నొక్క
రేవు నెలకొల్పినార మేరీతినైన॥

2 అధి.— సిబేరియా కొరియాల మధ్యఁగల సముద్రప్రాంతములను చైనావారి నుండి మన నైపుణీసాహసంబుల కొలఁది నుపాయంబుగ వశంబుఁ జేసికొని యందు "వ్లాడివస్టక్" అను పేర నొక్క రేవు గట్టినారముగద.

చక్ర— అవునవును, అంతియెగాక

ఉ॥ ఆహవభూమి వీరవరు లబ్బుర మందుచుఁ జూచుచుండఁగా
బాహుబలంబుచేతనో, యుపాయముచేతనో యెట్టులైననున్
సాహస మొప్పఁగా మెలఁగి సన్నుతిఁగొన్న సెఘేలియాదులన్
వే హరియించినాముగద భీతులజేసి జపాను వారలన్॥

చతుర్విధోపాయంబులచే నెట్టులైన జపానువారల నదలించి తుదకు "సెఘేలియన్" ద్వీపమును మనస్వాధీనం బొనరించుకొంటిమి కద.

2 అధి.— అవునవును, కాని యింతటితో మిన్నకుండక

తే॥ గీ॥ ఇతరములగు రేవులు మనకెన్నియున్న
నొక్క కొరియాకు సమమౌనె నిక్కముగను
గాన నెట్లైన నా కొరియాను గూడ
మనకు స్వాధీన మొనరించుకొనఁగ వలయు॥



చక్రి.— నిశ్చయముగఁ బ్రథమాచరణం బయ్యదియే కాని వేఱొండు కాదు. కావున

శా॥ మీ రీ రీతి వచించినట్టి పలుకుల్ మేలాయె నాలింప వ్యా
పారస్థానము సౌఖ్యదాయకమునై భాసిల్లుచున్ జీవనా
ధారంబై విలసిల్లుచున్న కొరియా దర్పంబుఁ గైకొంటకై
ధీరత్వంబు వహించి పాటు వడరే ధీరుల్ మిమున్మెచ్చఁగన్॥

కావున యికార్యార్థంబై యనుకూలకాలాన్వేషణోత్సుకులరై సమయంబు నిరీక్షింపుఁడు.

(కొందఱు చారులు ప్రవేశించి)

చారు.— దేవా! ఎల్లదేశంబులందుఁగల వార్తావిశేషంబులఁ బరికించి మీ కెఱుకఁ జేయనుద్యమించి తదర్థంబై భవదాజ్ఞను గోరుచున్నాము.

చక్ర.— మ్రొక్కఁబోయిన వేల్పెదురుగ వచ్చెనన్నట్లు దేశవార్తలఁ దెలిసికొనఁ గుతూహలినై యున్న నా మ్రోలకు నరుదెంచి తద్వార్తల నెఱుకఁజేయ నున్నందులకు మిగుల నానందంబయ్యెఁ గాన వేగ వక్కాణింపుఁడు.

చారు.— దేవా! ముఖ్యంబైన యొక్క వార్త వక్కాణింతు మవధరింపుఁడు. జపాన్ ప్రభువులు

శా॥ చైనా క్షీణత నుండె నంచు మరి రుష్యా రాజధానస్థులా
చైనావారిని నేర్పున న్జోరవచే సాధించి మెప్పించి యె
ట్లైనన్ వే కొరియా హరింతు రనుచున్ స్వాంతంబున న్భీతులై
దీనత్వంబున నుంటఁ గాంచితిమి సందేహంబు లేదిందునన్॥

మఱియు

తే॥గీ॥ అంత నూరకుండకయు సాహసముఁ బూని
ధీరత నెసంగు నాజపాన్వీరవరులు

నెడలి రనికి చైనావారి బీరమడప
బాహుబలమున నాహవోత్సాహులగుచు॥

చక్రి.—ఏమీయాశ్చర్యము!

కం॥ కొండంతయాస మనమిం
దుండంగ జపానుకూళ లురుగర్వాంధుల్
తండోప తండములుగా
దండుం గొంపోయి వారి దండించిరిగా॥

మనభావంబులకు మేరమీఱని చైనావారి కెట్టియిక్కట్లు సంప్రాప్తంబయ్యె! తరువాత?

చారు.— అంత మన మా కొరియాను వశపఱచుకొందుమేమో యనియు నట్లొనర్చుకొనినచోఁ దమకు శూలసదృశంబగుననియుఁ దలఁచి యాకొరియాను విడువఁజాలక చైనావారిపై దండెత్తిపోయిరి.

—తరువాత?

చారు.— అటుల బైలుదేరి చైనా కొరియాలను రుష్యా మొదలగు పరరాష్ట్రముల పాలు గాకుండ రక్షించెదమని చెప్పి యొప్పించి, కొరియాను, తత్కొరియా చైనాల మధ్యఁగల " లియోటాంగ్ " అనుప్రదేశంబును, వశముఁ జేసికొని యిప్పుడు

కం॥ రాజాధిరాజులో యనఁ
దేజోవైభవము వఱల దృఢతరమతులై
యీజగతి వినుతకీర్తి వి
రాజితులైయుండి రతి పరాక్రమ మొప్పన్॥

చక్రి.— (రోషంబున) ఔరా!



శా॥ ఏమీ వారల సాహసంబు బళిరే యింతేనియు న్గొంకకే
తామే బాహుబలాఢ్యులంచును మదోన్మత్తాయితస్వాంతులై
వేమాఱున్ జయినా పయిన్ దుముకుట ల్వీక్షింప వీక్షింపఁగా
మామేను ల్గడుకంపమొంది కినుకన్ మాచిత్తముల్ సెందెడున్॥

కావున మనకు సాహాయ్యులుగనున్న జర్మనీ, ఫ్రాన్సు, చైనా, వారలం గొంపోయి యాజపానువారల నెదుర్కొని పోరాడి యా లియోటాంగును మగిడి చైనా వారి కిప్పించుట కర్తవ్యంబు. మనమెన్నడో కొరియాను హరింతుమని యిప్పుడు చైనా వారికిట్టియిడుముల సంఘటించిరి కదా! కావున యోప్రధాన యోధులారా! జపాను వారలతో యుద్ధంబుఁ జేయ సిద్ధంబై రండు! త్వరపడుఁడు!!

2 అధి.— భూపాలా! ఇందరి సాహాయ్యంబేల! యొకచిన్న లంక నదలింప నపారతర రాజ్యభారధురంధరులగు తమకొకరి సాహాయ్యంబు వలయునా!

ఆ॥వె॥ గోటఁ జేయుపనికి గొడ్డండ్రతోఁ జేయ
నేల! పరుల సాయమేల! మనకు
వేడ్కనిటులఁ జేయఁ బిచ్చుకపైని బ్ర
హ్మాస్త్రమా యటంచు నవని నగరె॥

చక్ర.— నీవు పలికిన పలుకులు సరికావు. ఏమనిన

తే॥ గీ॥ చాలనేర్పరులైనను జాలరులకు
వలయు నెరయు మున్నగునవి వలయుఁగాదె
అటులె మనమెంత శూరులమైన నిపుడు
పరుల సాయంబుఁ గోరుట పాడియగును॥

కావున సేనాసముదాయంబు నాయత్తపఱచుఁడు.

1 అధి.— చిత్తము. (నిష్క్రమించును)

(యవనిక పడును)

(వాచాలుఁడు ప్రవేశించి)

వాచా.— రుషియనులు తనువశంబొనరించుకొనఁ గోర్కెగల రేవుస్థానంబుల జపానులు సంగ్రహించిరని తెలిసికొని వారిపై దండెత్తి చనినసంగతి నే నిచట నుండియే తెలిసికొంటి నిఁక పాంచాలుఁ డేమివిశేషంబులఁ జెప్పఁగలఁడో విందునుగాక! అదిగో! అతఁడు నిటులనే వచ్చుచున్నవాఁడు.

పాంచాలుఁడు (ప్రవేశించి) వాచాలా! వింటివా?

వాచా.— ఆ! వింటిని! వింటిని!!

పాంచా.—ఏమి వింటివి?

వాచా.— ఏమి వింటినా? నీవు చెప్పంబోవు సంగతియె.

పాంచా.— నేను చెప్పకమున్న నీ వెట్లు వినఁగలిగితివి?

వాచా.— అటులైన నీవు చెప్పకమున్న "వింటివా" యని నన్నెట్లడిగితివి?

పాంచా.— ఓయి చతురుఁడా, వాచాసంపన్నుఁడనుచే నట్లు ప్రశంసించినందులకు నీ చాతుర్యంబెల్ల వెల్లిఁ గొలుపుచుంటివా! ఇఁకఁ జెప్పెదవినుము.

వాచా.— నీవు చెప్పఁబోవు సంగతి నింతకుమున్న నెట్లినో వింటిఁగాని తదుపరి రుషియనులు జపానువారిపై దండెత్తి యేమిచేసిరో యా వృత్తాంతంబు విశదీకతింపుము.

పాంచా.— రుషియను లేమిచేసిరో కాని చైనాలోని బాక్సరులు రుషియనులపైఁ గన్నులెఱ్ఱసేయుచుండిరఁట. తద్వృత్తాంతంబుఁ గనుఁగొనివచ్చెద. నీవిచ్చోట నే యుండుము.

(నిష్క్రమించును)



వాచా.— ఇతఁడు నాసంగతి యన్న, నేఁ బ్రేమించు యీ రషియనుల సంగతి యన్న, నంతగా విమర్శింపఁడు. పోనిమ్ము, ఇపు డేమికొదువ! నే నిచ్చటనుండియే యెల్లవిషయంబులఁ బరికించుచుండెద.

(అని నిష్క్రమించును)

ద్వితీయరంగము. (బాక్సర ప్రవేశము.)

చైనారణ్యము.

1 బాక్స.— ఓయి బాక్సర ప్రముఖులారా! రుష్యావారు చైనావారి లియోటాంగు విషయమై లేనిపోని జోక్యముఁ గల్పించుకొని జపానువారిపై దండెత్తిరఁట. అట్లు దండెత్తి

తే॥గీ॥ ఆ జపానువారల రుషియా యధిపులు
కడిమి నెదిరించి బెదరించి కడునదల్చి
యా "లియోటాంగు"ఁ గైకొని యపుడె మగిడి
యొసఁగిరఁట చయినావార లుల్లసిల్ల॥

2 బాక్స.— ఇట్లొనర్ప వీరల కా చైనావారు చుట్టంబులై జాపానులు కాక పోయిరా!

బాక్స.— ఎవరేమైన నేమి? వీరు స్వలాభార్థంబయ్యె యిట్లొనర్చిరి. అది యెద్దియనిన

తే॥గీ॥ తా రొనర్చిన యీ యుపకారమునకు
గాను ప్రత్యుపకారంబు గాఁగ మగిడి
యా "లియోటాంగు"ఁ గైకొని యందు నలువ
దైదుకోట్ల రూకలకు పోర్టార్థరనఁగ
నొప్పు నొక్కకోటను గట్టి యుద్ధనావ
లుంచి "మంచూరియా" తోడ నంచితముగ
రాజధానితోడను గూడ రైలుమార్గ
మేర్పఱచిరఁట ధృతివహియించి యారా॥

నిష్కపట మనస్కులగు చైనావారు "లియోటాంగు" తమకుఁ గాక మరియె వరిని వశంబైన నేసుఖమని యెంచక జపానువారినుండి గ్రహించి యప్పుడే రుషియనుల కొప్పగించిరఁట. వీరును యా లియోటాంగునందు కోట్లకొలఁది ధనవ్యయంబుచే బలిష్టమైన కోటఁగట్టి మంచూరియా యందు యుద్ధనావలచే మెండుగా నిండించి వెండియు నిరర్గళగమనాగమనాదులకై ధూమశకటపథంబులఁ జెక్కుల నేర్పఱచి సుఖతరంబుగ రాకపోకలఁ జేయుచుండిరఁట. కావున వీరి దర్పంబార్పకున్న ముందు పేరిడుములఁ బడవలసివచ్చుఁ గావున తడయక వీరిని డీకొనరండు! తదుపరి మన యిచ్చవచ్చినటుల విదేశంబులకుఁ గూడ నొక్కింత దాడి వెడలుదము.

2 బాక్స.— ఆగు మాగుము! ఆదెస వచ్చువారెవ్వరో విలోకింపుము! (అని వింతగ జూచును.)

1 బాక్స.— (ఇంచుక వెఱపుతో) ఇటుఁజూడుము!

శా॥ వారేకాకయపారవీరహృదయవ్రాతంబు వెన్వెంట రా
ధీరాగ్రేసరులైన యోధతతితోఁ దేజంబు శోభిల్లఁగా
భేరీనాదము రోదసి న్విపులమై భీతిన్ ఘటింపంగ నె
వ్వారో యీ దెసవచ్చువారిఁ బరికింప న్వేగ వీక్షింపుఁడీ॥

2 బాక్స.— (నిదానించి చూచి) ఏమీచిత్రము! పరరాష్ట్రాధిపతు లిట్లరుదెంచ నేమి హేతువై యుండును?

1 బాక్స.—

కం॥ పరచక్రవర్తులిపు డి
ట్లరుదెంచఁగ నేమిహేతువైయుండునో మీ
రు రయం బొప్పఁగ నటఁజని
యరయుందగు నాయుదంత మాద్యంతంబున్॥



2 బాక్స.— ఓహో! ఈ చక్రవర్తులెల్లరా రషియనులసాహాయ్యార్థంబో, మనవిదేశ దండయాత్ర కడ్డొనర్చుటకో యేతెంచియుండ నోపుననితోఁచెడిని.

1 బాక్స.— అవును, కావున

ఉ॥ ఈ వసుధ న్సుధీజనము లేపనినైన నొనర్చువేళలన్
భావి శుభాశుభం బరసి ప్రౌఢిమ మొప్ప నొనర్తు రర్థముల్
గావున నిప్పుడీరు హితకార్యము వేగమె యాచరింపరే
ఈవిధి నన్యభూమివరు లిట్లరుదెంచిన కారణంబునన్॥

2 బాక్స.— మనమిప్పట్టున నీ యుద్యమమునుండి యించుక శాంతివహించి పరాఙ్ముఖుల మగుటయే యుచితంబని తోఁచుచున్నది.

1 బాక్స.— అవును. నీవు నుడివిన పడువున నీసమయమందు శాంతీభూత చేతస్కుల మగుటయే కర్తవ్యంబు. కానిమ్ము, కాలంబు చిక్కకపోదు; మన యుద్యమంబు నెరవేరకపోదు. కావునసించుకవిశ్రాంతిఁగైకొందము; రండు, రండు.

(ఇద్దరు నిష్క్రమింతురు. తెరపడును)

పాంచాలుఁడు, వాచాలుఁడు, (ప్రవేశము)

వాచా.— ఆర్యమణీ! ఏమివిశేషంబులు?

పాంచా.— ఏమియు లేవుకాని, నీపక్షమువారె పకపకలాడుచుండిరి.

వాచా.— దేవా! ఒకరు నాపక్షమువారైరె మఱియొకరు కాకపోయిరా! విజయమెవరి పక్షమున నుండె?

పాంచా.— ఆసంగతియె నేఁజెప్పకమున్న నీవెఱుంగనగును.

వాచా.—అతిబలపరాక్రమాన్వితులు రుషియనులే కావున విజయమును వారిదయ్యె యుండునని తలఁచెద.

పాంచా.—నీపక్షమువారును వారేయని నేనుదలంచెద నింకజరిగినసంగతిం జెప్పెద నాకర్ణింపుము. రుషియనులు ప్రత్యుపకారార్థంబై చైనులొసంగిన ప్రదేశంబులందు స్థిరంబుగ నెలకొని యుండుటంజేసి బాక్సరులెదిరింపంజూచిరి; కాని పరరాష్ట్రాధిపతులు రుషియనుల సహాయార్థంబై వచ్చియుండుటంజూచి సమయంబు కాదని యించుక శాంతివహించిరి.

వాచా.—(తనలో) "పరుగెత్తలేక బలాదూ" రన్నట్లు శూరవరులంజూచి సమయంబుగాదని భీతిల్లి మిన్నకున్న వారిని శాంతించినట్లుగ నీయన నుడువుచుండె. రుషియనులేడ! తదితరులేడ! (ప్రకాశముగ) ఘనకార్యధురేయా! తదుపరి సంగతియేమి?

పాంచా.—బాక్సరులు చేయందలంచినపనిని జాపానులు సేయంగలరని నా నమ్మిక; కావున నచ్చటివార్తలం దెలిసికొన నున్నవాండ.

వాచా.—(స్వగ.) ఈ నాచేంగలవార్తాపత్రికకు మూండురూకలు సెలవుంజేసినంగాని లోకవార్తలు తెలియకున్నయవి. (పాంచాలునకై చెయింజూపి) ఇప్పుడీతని వలన నట్టివ్యయంబులేక తెలిసికొననగుంగద! (ప్రకా.) మహానుభావా! అట్టి మహాకార్యంబున కింకందడవేల?

పాంచా.—అవును, నేనిప్పుడే యెల్లవిషయంబులం బరికింపం జనెద.

(నిష్క్రమించును.)

వాచా.—వ్యాఘ్రమేషంబులకు వైరంబైన విజయం బేపక్షమనివిచారింపవలయునా! కావున, కాంగలసంగతి నే నిచ్చట నుండియె తెలిసికొనియెద. (నిష్క్ర.)

## తృతీయరంగము, జపానుకోర్టు.

(ప్రవే.) చక్రవర్తి, **1, 2, అధిపతులు.**

చక్ర.—వింటివా! మనస్వాధీనంబైయున్న లియోటాంగునుం జూచి యోర్వలేక నా రుషియావారు చేసిన కృత్రిమంబు!



**2** అధి.—ఏదది? మనలనుండి సంగ్రహించి చైనావారి కిచ్చు టెఱుంగుదును. తదుపరి యేమిజరిగె.

చక్రి.—తరువాత నద్దానినే ప్రత్యుపకారార్థంబై చైనావారొసంగంగైకొని యందు స్వేచ్ఛావిహారంబు సలుపుచుం గోటలం గట్టుచు రైలుబండ్ల నేర్పఱచి గమనాగమనాదుల నిరాటంకంబుగం జేయుచుండిరంట.

**1** అధి.—ఓహో! ఎవ్వరైన నడ్డుసేయంజాలరైర ?

చక్రి.—బాక్సరులు కినిసి యెదిరింపంజూచిరి కాని నిష్ఫలమనోరథులైరి.

**1** అధి.—కారణంబేమి? వీరు బలశౌర్యసాహసాధికులనియే విందుముగద.

చక్ర.—అవును. కాని నేండిట్లగుట కొకకారణంబుగలదు.

**2** అధి.—ఏదది?

చక్ర.—

శా॥ ఔరా యేమని చెప్పవచ్చు నతిధైర్యస్ఫూర్తి యొప్పారంగా
శూరాగ్రేసరులైన యోధవరు లస్తోకంబుగానుండ రు
ష్యారాజుల్ పరభూపతుల్ దమకు తోడై రాంగంగైకొంచు నే
తేర న్వారలంగాంచి బాక్సరులు శాంతింజెందినా రయ్యెడన్॥

**1** అధి.—తరువాత?

చక్ర.—తరువాతవార్త యెల్లరకుం దెలిసినదియె.

తే॥గీ॥ అమెరికా జర్మనీమొదలైన యన్య
దేశపతు లెల్లరును నిజదేశగమను
లౌటం గాంచుచుండియును రుష్యా యధీశు
లందెయుండిరి నిండు సాహసముతోడ॥

1 అధి.—అట్లుండుటకు కారణంబేమి?

చక్ర.—

తే॥గీ॥ కారణము లేకపోలేదు వారి రాక
పోకలెల్ల నిరాటంకముగను జేయఁ
గలుగు పొగబండిదారులఁ గాచుకొఱ క
టంచు నొక నెపమున నుండి రచట స్థిరత॥

అధి.— ఇట్లు శాత్రవులు బలముగ నందుండినయెడ మన ప్రాణతుల్యంబగు కోరియాకు భంగము కలుగకతప్పదు. ఎట్లైన వీరి యధికారమందుండి తగ్గించుటయే కర్తవ్యము.

చక్ర.—

చం॥ దుడుకుగఁ బెక్కురాష్ట్రము లెదుర్కొనిరాఁగఁ బరస్పరంబుఁదో
డ్పడుదమటంచు నాబ్రిటిషువారలతో మనకొక్కచట్టమే
ర్పడెఁగద కావున న్మనకు వారలసాయము లుండ మెండుగన్
జడియఁగనేల? మీరలిఁక సాహసము న్వహియింపఁగాఁ దగున్॥

అన్యరాష్ట్రాధీశు లొక్కసమయంబున దండెత్తివచ్చినచోఁ బరస్పరము సాహాయులమగుదుముకదా! కావున నిప్పుడు బ్రిటీషువారి సాహాయముగలదు

మఱియు

ఉ॥ అంతియకాక బాక్సరుల నాహవభూమి నెదిర్చి లోన నొ
క్కింతయు భీతిలేక మనమెల్లరము న్మెలఁగంగ నప్పు డే
కాంతమునందు నా యమెరికాయధికారులు చూచి యెంతయున్
సంతసమంది నేస్తమును సల్పిరిగా మనతోడ వేడుకన్॥

వెండియు



కం॥ ఈవిధ మిట్లుండఁగ రు
ష్యావారికి మనకుఁ గలహ మయ్యెడిచోఁ జై
నావా రూరకయుందురు
భావింపఁగఁ దొల్లిగల నిబంధనవలనన్॥

ఇందరి సహాయంబులుండ మనకేమిలోపము? కావున రుషీయనుల [illegible]కారముఁ దప్పక తగ్గింపనగును.

1 అధి.—దేవా! నాకొకవింత తోఁచుచున్నది, ఏమన

శా॥ త్రారే, యిందునకింత సేపరయఁ జిత్రంబయ్యె మాకియ్యెడన్
ధీరుల్ గారె జపానువారు! మఱియు న్దేశంబుపైఁ గూర్మి లే
దే రారే రిపుభంజనంబునకు విస్తీర్ణాభిమానంబు చే
కూఱు న్వారలె మిమ్ము యుద్ధమునకై కొంపోవఁ బ్రార్థింపరే॥

మఱియు

సీ॥ అన్యభూవరులతో నాజివాటిల్లిన నొడలుదాఁచుకొనెడు జడుఁ డెవండు
జీవనాధారమౌ సీమలన్యులపాలఁ బడుచుంటకోర్చెడు పంద యెవఁడు
శాత్రవతతి శౌర్యసాహసాదులఁగాంచి వెన్నిచ్చిపాఱెడు పిరికి యెవఁడు
ఆకులస్వాంతులై యధిపతుల్ సమరాభిముఖులౌచునుండఁగ ముది తుఁడెవఁడు

తే॥గీ॥ సారమతిఁదలపోసి దేశంబుకొఱకు
స్వార్థసౌఖ్యపరిత్యాగ మాచరింప
కుండు వినుతరజ్ఞాన శూన్యుండెవండు
సత్యముగ మన యీజపాన్ క్ష్మాతలమున॥

చక్ర.—ఆహా! నీపలుకులం దించుకేనియు నసత్యంబులేదు, కావున నామనం బమం దానంద కంపళితంబయ్యె నిఁక కర్తవ్యంబు వాక్రుచ్చెద నాకర్ణింపుము. ఓయీ! వీరవరులారా! బాక్సరుల కలహానంతరమున

తే॥గీ॥ చక్రవర్తులెల్లరు నిండు విక్రమమున
నప్పుడే తమపురముల కరిగియుండ
నింతదనుక నా రుషియను లేఁగకున్న
హేతువెయ్యదియో వేగ నెఱిఁగిరండు॥

మఱియు లియోటాంగునందు

ఉ॥ కోటను గట్టనేటికని కోట్లకొలంది ధనవ్యయంబుచే
నేటికి రైలుమార్గముల నేర్పఱుపంగ నటంచుఁ జిత్తమం
దోటయొకింత లేక యిట నుండఁగ నేటికటంచు వారలన్
దైటవడంగఁ దెల్పుఁడని ధీరతఁబల్కి యెఱింగి రాఁదగున్॥

మీపలుకులకు సరియయిన యుత్తరం బిచ్చినచో సరే. అట్లీయకున్న తుట్టతుద కిట్లనుఁడు

ఉ॥ ఇచ్చటనుండి మీరు వడి నింతటనైన నిజప్రదేశముల్
జెచ్చెరఁ జేర నియ్యెడను జెల్లెడిన ట్లొనరింపకున్నచో
హెచ్చును వైరకారణము లిర్వురకంచు వచింపమేమిటే
వచ్చితిమంచుఁ జెప్పి రిపుభావములం గని రండు వేగమే॥

రాయభారులు—చిత్తము, అటులే పోయి సంభాషించి శీఘ్రగతిని వచ్చెదము

(అని నిష్క్రమింతురు)

చక్ర.— మనము పంపిన రాయభారమున కా రుషియావారు



ఉ॥ ఇత్తఱి నుంచి యుత్తరము లిచ్చినచో సరె యీయకున్న మీ
చిత్తములందు రోషములఁ జెచ్చెరఁబూని జవంబుమీర నా
మత్తుల యుద్ధభూమిఁ బలుమారు నెదుర్కొని వారిపాలిటన్
మిత్తివలె న్మెలంగుచును మీ యభిమానముఁజూప మీకగున్॥

1 అధి.— అందునకింకను సందియంబ! ఎల్లరును మీయాజ్ఞ శిరసావహించి యాచ రించువారెకాని కలనైన మీపలుకులకు జవఁదాటువారలుఁ గలరా? మఱియుఁ జతుర్విధోపాయంబులలో నెద్దాననైనఁ గార్యసాఫల్యం బగునంతదనుక పూనిక విడువఁజెల్లదుగద! అందు

కం॥ భయదారణ్యస్థ విహఁగ
చయరవగతిఁ గాక యువతిజన శిక్షిత వా
క్ప్రియతిఁ గల చిలుకలట్టుల
ప్రియభాషలు వలుకువారు ప్రియులెల్లరకున్॥

కావున

కం॥ పగ రేబవలును సాధిం
పఁగ నిశ్చితులైన యెట్టి పగతురనైనన్
బగమాన్పి సఖ్యమొనరిం
పఁగనగు లోకంబు సామవాక్యంబులచే॥

అద్దానఁగాదేని

కం॥ మాంత్రిక వరుఁడాడించెడి
జంత్రంపుం బొమ్మలటులఁ జతురతతో నా
డింత్రు జగము భేదంబను
తంత్రోపాయంబుచే నుదారగుణాఢ్యుల్॥

మఱియు

కం॥ ఏయహితునైన హితుఁగాఁ
జేయుఁగ దుస్సాధ్యమైన చేఁతలు సాధ్యం
బై యలవడుఁగద భేదో
పాయంబునకంటె నొండుపాయముగలదే॥

కావున భేదోపాయంబుచే నన్నియు నెఱవేరఁగలవు. అటులఁ గాకున్నచో

తే॥గీ॥ ఆసవప్రాపేత కుసుమాశ్రితాళివ్రాత
కామినీజన గాఢోపగూహనక్రి
యావిశేష లీలాక్రాంతుఁడౌ విటుగతి
ద్రవిణమున కశేష జగము దాసగణము॥

అటులాటంజేసి

మ॥ కుటిలుండైనఁ గురూపుఁడైన వికలాంగుండైనఁ వేశ్యాంగనా
పటలం బెవ్వఁడనూనవిత్తమిడునో వానింఘనుండంచుఁ బ
ల్కుటయున్సఖ్యమొనర్పుకొంటయు బలెన్ లోకంబుసంపన్ను చెం
గట నశ్రాంతమునాశ్రయించు నిది నిక్కంబెంత యోజించినన్॥

మఱియు

ఆ॥వె॥ సామ భేదములకు సాధ్యంబుగాకున్న
దానమునను సాధ్యమౌ నొకింత
నదియు విఫలమైన నవనీశుఁ డుద్దండ
దండయాత్ర నెఱపఁ దగును పిదప॥

తురీయోపాయంబగు నిద్దాన నన్నియు సఫలం బగుననుటకు సందియంబులేదు.



చక్ర.— అవును.

సీ॥ సంధిచేకొనునట్లు సామవాక్యములచే వినయతఁబలికిన బేలయండ్రు
ఒరులలోఁబఱచు భేదోపాయ మరసెడి కార్యనిర్వర్తులఁ గపటులండ్రు
ద్రవిణప్రదాది కారణముల రణముల వెనుదీయువారల భీరులండ్రు
దండసముద్ధరోద్దండత నెఱపు భుజాదండు విక్రమశాలియండ్రు॥

తే॥గీ॥ కాన నిఖిల భూభృత్సముత్కరము కరము
జగము వెఱగొంద రిపులెద దిగులుఁజెంద
దశదిశావళి యశ మమందంబునొంద
ధరణిధవుల కర్హము దండధారణంబు॥

1 ఆధి.— సత్యము.

ఆ॥వె॥ నిజభటాలియైన నిర్ణిద్రవిక్రమ
స్ఫూర్తిఁ దత్తదుచితవర్తనములఁ
జూపకున్న మిగులఁ జులకనగాఁ జూచు
నన్నఁ బరులఁగూర్చి యెన్న నేల॥

వెండియు

కం॥ చనువిచ్చిన సింగంబగు
శునకము, చనువీయకున్నచో సింగంబే
శునకంబగు “దండం దశ
గుణంభవే” త్తనియెడి నుడుగున్ భువి వినమే॥

అదిగో! రాయభారులును సమీపించుచున్నారు. ఏమిప్రత్యుత్తరంబుదెచ్చిరో వినదము.

(రాయభారులు ప్రవేశింతురు.)

చక్ర.—ఓ స్వామికార్యధురేయులారా! మీరరిగిన సమాచారం బేమయ్యె?

రాయ.—దేవా! ఏమిచెప్పుదుము, మాపలుకులు వినియువిననివారివలె వినుచు నొక్కరై నను సరియైన యుత్తరంబీయకుండుటంజేసి మగిడి మగిడి యడుగుచుంటిమి అటులడుగుచుండినను;

కం॥ కలనైన యుత్తరమిడక
పలుకఁదెలిచి హితముగనైనఁ బలుకక మఱియుఁ
జెలఁగి జల స్థల సైన్యా
దులఁగూర్చుచునుండి రధిప, తోరముగాఁగన్॥

చక్రి.—ఓహో! ఇఁక రాయభారములు చాలుఁజాలు, సభ్యులారా! వింటిరా! రుష్యా వారి యుద్యమంబు? ఇఁకఁదడయనేల? కర్తవ్య మూహింపుఁడు.

2 అధి.—దేవా! ఊహించుటయందే యింకను గాలవ్యాపనంబుఁ జేయవలయునా? కర్తవ్యంబుఁ దారెఱుంగరె?

చక్ర.— ఎఱుఁగకుండుట కేమున్నది? చెప్పెద నాలకింపుఁడు.

సీ॥ నిఖలసాహసులార నిరుపమవిస్ఫురద్యశులార వినుతగుణాఢ్యులార
మనకు ప్రాణసమానమనఁదగునట్టి యా కొరియానుదలపోసి కూర్మిఁగనుఁడు
పరరాష్ట్ర భూపతుల్ కొరియా సమీపంబునందు నుంట మనకు హానిగాదె
ఇపుడురుష్యావారు కపటంబునన్ లియోటాంగున బలిమినుండంగ లేదె॥

తే॥గీ॥ ఇటులనుండఁ జెల్లునె కాన నిప్పుడింటి
కొక్కరైనను నభిమానమూని పోరు
సలుపరావలె ననుచు నా పలుకులుగను
దెలియఁ బ్రకటింపుఁడీ జపాన్ దేశమందు॥



మనమిప్పుడు సమరసన్నాహులము గాకున్నచో వ్యాపార స్థానంబులనే కాక రాజ్యాధిపత్యంబును గూడఁ గోలుపోవలసివచ్చును. కావున

కం॥ మనమిపుడు మిన్నకుండిన
మనకొరియా యొకటె కాక మన యీ రాజ్యం
బును శాత్రవతతి పాలగు
ననుటకు సందియము లేదఁటంచును జెప్పుఁడీ॥

ఏనును వీరవరుల సమరోత్సాహులుగాఁగఁ బ్రోత్సాహపఱచి యుద్ధరంగంబునకు సిద్ధపఱచెద. మీరును సకలజనులకీ వృత్తాంతంబుఁ బ్రకటించి తత్ప్రయత్నంబుననే యుండుఁడు. పొండు.

(అందరు నిష్క్రమింతురు)



## తురీయరంగము: పురవీధి.

(ప్రవే.) 1 అధిపతి, కొందరుపౌరులు.

1 అధి.— ఓ జపానుదేశ నివాసులారా! సుగుణగణాలంకృతులారా! మానధనులారా! వింటిరా! మున్ను మన వశంబైయున్న లియోటాంగును రుష్యావారు, చైనా వారికి మగిడి నిప్పించు తలంపు కలవారివలె మెలఁగి యటులఁజేసియుఁ దుదకు తమవశంబే చేసికొని యందు గొప్పకోటను చీమయైనఁ జొరకుండునటుల దిట్టముగఁ గట్టి యందు బలంబుగ నెలకొని యుండిరఁట. ఇట్లుండుటచే మన వ్యాపారస్థానంబులగు కోరియామున్నగు సీమలకు భంగంబని యెంచి మన చక్రవర్తిగారు, వారి నిజరాజ్యంబులకేఁగ రాయభార మంపిరి. కాని సదుత్తరంబు రామింజేసి యుద్ధసన్నద్ధులై పురస్థుల కిట్లు ప్రకటింప ముమ్మంపిరి. యేమనిన

సీ॥ నిఖిలసాహసులార నిరుపమవిస్ఫురద్యశులార వినుతగుణాఢ్యులార
మనకు ప్రాణసమాన మనఁదగునట్టి యా కొరియాను దలపోసి కూర్మిఁగనుఁడు
పరరాష్ట్రభూపతుల్ కొరియా సమీపంబునందు నుంట మనకు హానిగాదె
ఇపుడు రుష్యావారు కపటంబునన్ లియోటాంగున బలిమి నుండంగ లేదె

తే॥గీ॥ ఇటుల నుండఁజెల్లునె కాన నిప్పు డింటి
కొక్కరైనను నభిమానమూని పోరు
సలుపరావలెనని మనచక్రవర్తి
గారు మనకు నాజ్ఞాపించినారు నేఁడు॥

ఇందులకు మనమియ్యకొనక మిన్నకుంటిమేని రిపులు బల్లిదులై, తదుపరి

సీ॥ వినరయ్య మనరాజ్యమును ముట్టడింతురు శత్రుధాత్రీశ్వరుల్ సమయమెఱిఁగి
మనమిప్పు డూరకుండిన మనరాజ్యంబు శత్రులపాలౌట సంశయంబె
అట్లైనచో నెట్టియధికారములనైన సంఘటింతురు గాదె సత్యముగను
వైరుల కారీతి వంగియుండుటకంటె నరయంగ నైచ్యమొండైనఁ గలదె॥

తే॥గీ॥ తాము పాలించుచున్నట్టి ధరణి రిపుల
పాలుకావించి వారికి బద్ధులగుటఁ
జెల్లినను దుర్బలులకెల్లఁ జెల్లుఁగాని
మనకుఁజెల్లునె సుగుణ సన్మాన్యులార॥



1 పౌరుఁడు.— అయ్యా! జరిగినవృత్తాంతంబాలింప మాహృదయంబులకు శోకరోషాదులొక్కటఁ బెనఁగుచుండె నింక కర్తవ్యంబు ననుజ్ఞయిండు.

2 పౌరుడు.— ఆర్యా! ఈచెప్పిన ఘోరపువార్తఁ జెవులారవిని యింకను సైతుమా! వేగ సెలవొసఁగుఁడు.

1 అధి.— దేశీయులారా! ఇపుడు మన వ్యాపారస్థానంబులకే ముప్పురానున్నయది యింతియే కదా యని మనమిపు డుపేక్షించినచో మనరాజ్యంబునకు చేటు కలుగు ననుటకు సందియంబులేదు.

సీ॥ రాజ్యలక్ష్మిని శత్రురాజుల పాల్సేసి పడరానియిక్కట్లు పడఁగనెట్లు
స్వేచ్ఛావిహారతఁ జెలఁగుచున్న మనము వైరివీరులఁగొల్చి బ్రతుకుటెట్లు
వారిశాసనముల వారింపలేక దుస్సహమైనఁ దలయొడ్డి సైచుటెట్లు
ధీరోద్ధతాత్ము లీదేశస్థులను మాట నీటఁగలిపి యిందునిలచుటెట్లు॥

తే॥గీ॥ పూవులమ్మి జీవించిన పురమునందె
కట్టెలమ్ముచు జీవించు టెట్టు లకట
కనుక మీమదిఁ బ్రవిమల జ్ఞానబీజ
ములను నాటి పెంచరే దివ్యఫలములొసఁగ॥

1 పౌరు.— దేవా! ఎప్పటిసంగతియో యిప్పుడేల? కావున నిప్పటిముఖ్యాంశంబును మాత్రము వక్కాణింపుఁడు.

1 అధి.—ఓపౌరులారా! ఎప్పటిసంగతియైన నేమి? ఉపద్రవకరంబై ముఖ్యాంశంబగుదాని నహర్నిశంబును యోజింపనగుఁ గాన.

సీ॥ అనిశంబు వలయు సస్యాదులనెల్ల నొసంగు జపాను రాజ్యమును గనరె

కని కాకముల పాలుగాఁజేయు పికగతిఁ జనని జపానురాజ్యమును
గనరె

మానితశౌర్యాభిమానధీరులనీనఁజాలు జపానురాజ్యమును గనరె

క్షణమైన మిము వీడనని చెన్నుఁదట్టుదయాళు జపాను రాజ్యమును
గనరె॥

తే॥గీ॥ మఱియు మీమది నీ దేశమాత యమ్మ
గన్నమాతల్లికన్నను మిన్న యెన్న
ననుచు నెంచి యుద్ధమునకో యన్నలార!
రారె! కాపాడుకోనరె! మీరాజ్యము నిఁక॥

2 పౌరు.— (స్వగతముగ) ఓహో! వీరు మనయందు పూర్ణాభిమానము కలదో లేదో యని యింతగా బోధించుచున్నారు. (ప్రకా.) ఆర్యమణీ! ఏటికి మీకీసంశయంబు? మే మాచరింపదగు పని నియమించిన, శిరసావహించి చేయ సంసిద్ధులమైయున్నారము. అందులకై వేవిధంబులఁ బ్రార్థింపుచున్నారము. కావున త్వరితగతిఁ గర్తవ్యంబు పక్కాణింపుఁడు.

కం॥ ఇత్తఱిఁగల ధనమంతయు
నిత్తుము కావలయునన్న నింపెసలారన్
మత్తారుల వధియింతుము
చత్తుము భూపాలునాజ్ఞ సమరక్షోణిన్॥

1 అధి.—జయము! జయము!! మఱియు

సీ॥ ఎవనిశాసనవిధి యేవేళయందైన నవిలంఘనీయమై యలరు
చుండు

శిష్టజనావనదుష్టవినిగ్రహక్రియ లెవ్వనికి నిజఖేలనములు
ఎవనిప్రసాద సమృద్ధి నశేషప్రపంచ మమేయమై భవముగాంచు
నెవ్వానివర్తనం బెన్న సన్మార్గవర్తనమును జక్రసంరక్షణంబు



తే॥గీ॥ తాదృశ ప్రజాపతిని హస్తస్థితాభి
వంద్యచక్రు శివంకరుఁ బ్రవిమలాత్ముఁ
డైన యినుని మానవమాత్రుఁ డనుచు నెన్న
నొప్పు దెవ్వారికైన నీ యుర్విలోన॥

కావున యియ్యది రాజాజ్ఞయగుటంజేసి

ఉ॥ ఓ యసమానవిక్రమగుణోజ్వలులార! పరాక్రమంబునన్
మీయతులప్రభావములు మేలని లోకము మెచ్చ వైరికం
దోయికి భీతితోఁచి కడుతొట్రుపడంగను దోర్బలోద్ధతిన్
జేయరె యుద్ధరంగమునఁ జిందరవందరగా నరాతులన్॥

1 పౌరు.— ఆర్యులారా! నీరాకరగభీరులై భూరిశూరాగ్రేసరులై సమరసముత్సాహులగు మనజపానుల కింతగాఁ జెప్పవలయునా? కావున నిస్సంశయముగఁ బగతుఱఁబరిమార్ప నెల్లరును దప్పక సమరసన్నద్ధు లయ్యెదరుగాక!

1 అధి.—

ఉ॥ నేఁడు జపానువా రరుల నేర్పుకొలందిగ యుద్ధరంగమం
దోడుపడంగఁ జేసియు సమున్నత శౌర్యపరాక్రమంబులం
దీడొక యింతలేక జగదేకజనస్తుత సద్యశంబునన్
బోడిమి తనంబు మించుగతిఁబోరఁగఁ గల్గుత సత్యసంధులై॥

1 పౌరు.— తథాస్తు! తథాస్తు!

1 అధి.— మీరిఁక సకలజనుల కీ వర్తమానవృత్తాంతంబు విశదీకరింప నొకజాంఘికు నిచేఁ బురంబునఁజాఁట నియోగింపుఁడు.

2 పౌరు.—ఏమని?

1 అధి.—

తే॥గీ॥ ఓ సమస్తజపానునివాసులార!
శాత్రవులదాడిఁ దగ్గించి సమరభూమి
శౌర్యసాహసములఁ జూప సమయమిదియె
కాన రణమున కభిమానమూని రండు॥

అధమ మింటికొక్కరైన రావలయునని నలుదెసలఁ జాటఁజేయుఁడు.

1 పౌరు.— ఓహో! ఇందున కొక్క జాంఘికుఁడు చాలునా? మనము మువ్వురము మూఁడు వైపులను జాంఘికుండొక వైపునను జాఁటిన శీఘ్రంబుగ దేశీయులు వత్తురు. అటులఁగాకున్న నొక్క జాంఘికు పలుకులు లెక్కఁగొందురా? అద్దానన్నెల్లెడల విస్పష్టంబుగఁ బ్రకటంబు కాఁగలదా? కావున, మీరా వైపునఁ బ్రకటింపుఁడు, నేనీ వైపునఁ బ్రకటించెద.

తే॥గీ॥ ఓ సమస్తజపానునివాసులాక!
శాత్రవులదాడిఁ దగ్గించి సమరభూమి
శౌర్యసాహసములఁ జూప సమయమిదియె
కాన రణమున కభిమానమూని రండు॥

1 అధి.— ఓయి! నీవుపోయి జాంఘికుఁ దోడ్కొనిరమ్ము.

2 పౌరు.— చిత్తము. (నిష్క్రమించి జాంఘికునితోఁ బ్రవేశించును.)

1 అధి.—ఓయి! నీవు తప్పెటవాయిద్యమునందు నేర్పరుఁడవేనా?

జాంఘి.— అయ్యా! నేను చెప్పకయే మీకుఁ దెలియునటుల నీతప్పెటచేఁ జెప్పించెద (అని పలువిధముల వాయించును.)

2 పౌరు.— ఓయి! ఇఁక నాఁగుమాఁగుము, నీవుమిగుల గట్టివాఁడవే. ఇఁక నీయధిపులాజ్ఞాపించు నాజ్ఞ వినుము.

జాంఘి.— (అధిపతివంకఁ జూచి) బాబూ! ఏమి మీసెలవు?



1 అధి.— ఓయి జాంఘికా! నలుదెసలందు నీవిధంబుగఁ జాఁటవలయును

తే॥గీ॥ ఓ సమస్తజపాను నివాసులార
శాత్రవులదాడిఁ దగ్గించి సమరభూమి
శౌర్యసాహసములఁజూప సమయమిదియె
కాన రణమున కభిమానమూని రండు॥

జాంఘి.— ఓయిబాబో! ఇంతగోడవెందుకు? మీయభిప్రాయంబు తెల్పింది. ఇఁక నాసొంతకయిత్తంబుగఁ జాఁటెదనులె.

1 అధి.— అవునవును, అన్నిసంగతులు నీవును వినుచునేయుంటివి కావున అటులే చేయుము. (అని నిష్క్రమింతురు.)

జాంఘి.— ఓ సమస్తమైనోరికి తెలియఁగలందులకు తెలియఁజేసేదేమంటే ఇప్పుడు రుశ్యాశక్రవత్తులతో యుద్ధంజేయ సమయమొచ్చింది కాబట్టి కనీసం యింటికొక్కరైన యుద్ధంజేయ గొక్కనరండని పెబువుగారు సెప్పినారు కాబట్టి దబ్బునరండి! రండి!! (అని చాఁటి నిష్క్రమించును.)

గద్య.

ఇది శ్రీమత్ప్రాలేయాచలజా పాదారవింద
మకరందాస్వాద సానంద హృదయేందిందిర
శ్రీ రామన్వయ దుగ్ధపయోధి సుధా
కర గంగయాఖ్య పుత్ర వీరబ్ర
హ్మాహ్వయ ప్రణీతంబైన
జపానీయమునందలి
ప్రథమాంకము.



*



# జపానీయము.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము: గృహము.

(ప్రవేశము) భార్య, భర్త.

భర్త.— నారీమణీ! వింటివా?

భార్య.— ఏమని?

భర్త.—

మ॥ అతివా! శాత్రవపుంగవాళి కడుశౌర్యస్వాంతు లౌచు న్మదో
ద్ధతులై నేఁడిదె విజ్జృంభిగిరని యుద్దండప్రతాపంబు నా
యతశౌర్యంబును జూపువేళ యిదియేయంచు న్భేరిఁ జాఁటుటఁ
సతి! నీవున్వినవే యిదే చనియెదఁ సంగ్రామము న్సల్పఁగఁ॥

సతీలలామా! మనవ్యాపారస్థానంబులందు పగవారు విచ్చలవిడి సంచరించుటయేకాక మనరాణమువా రంపిన రాయభారంబు నిరాకరించి యందు జలస్థల సైన్యంబుల వృద్ధిపఱచుటచే మన దేశీయులు వారి బలంబు దగ్గింప సమరసన్నద్ధులై పోవుచున్నారు కావున

సీ॥ శత్రుజాలము యుద్ధసన్నద్ధులౌచుండ మేను దాఁచుకొనఁగ మేర యగునె



నామిత్రులెల్ల రాసందులై యనికేఁగుచుండ నేనిందుండ నుచిత మగునె
ప్రథిత దోర్బలులీ జపానువారనునుడి విశదమాటకు నిదివేళగాదె
ఇపుడూరకున్న నెంతేని భంగము ఘటిల్లదె మన యీరాజ్యలక్ష్మి కకట

ఆ॥ వె॥ ప్రమద మొప్పఁ దొలుత రాజ్యమేలి తుదకు
వైరి నృపులఁ గొలువఁ బౌరుషంబె
సద్యశమున బ్రతికి చావవచ్చునుగాని
చచ్చి బ్రదుకరాదు మెచ్చరెవరు॥

కావున సంగరమునకేఁగ నున్నవాఁడ నంగీకరింపుము.

భార్య.— నాథా! యొక్కమనవి.

భర్త. ఏదది?

భార్య. తే॥ గీ॥ ప్రాణనాయక సంగ్రామ రంగమునకు
వెంట ననుఁగూడఁ గొంపోవ వేఁర్మివరల
వేఁడుచుంటి మిమ్మింతియె వేఱుగాదు
కాన నాకోర్కిఁ దీర్పరె కరుణతోడ॥

మనోహర! సమరంబునకు నన్నుఁ గొంపోయితిరేని సంతసిల్లుదాననని మనవిఁ జేయుచుంటి.

భర్త. (చిరునవ్వుతో) సుందరాంగీ!

సీ॥ రణభూమి యది గాని, రమ్యతరోద్యాన వనభూమిగాదె భావజు కటారి
పటహాది భీకర ధ్వనులుగాని మృదంగలలిత ధ్వనులుగావు జలజ నేత్ర

శత్రుల పరుషభాషలుగాని సఖియల చతురోక్తు లవి కావు సన్ను
తాంగి
యుద్ధమాడుటగాని యుల్లాస మొప్పంగ బంతులాడుట కాదు పద్మ
గంధి

తే॥గీ॥ కోరరానట్టి కోరికల్ గోరఁదగునె
శత్రుతతి నెల్ల దునుమాడి సమరభూమి
వత్తు మగుడ నందాక నిర్భయముతోడ
నుండుమిచ్చోట మత్తవేదండయాన॥

నారీమణీ! యుద్ధమాడుట చెలులతో విహరించుటకాదు. కావున నీకోరిక మానుము; అబలల కిది చెల్లదు.

భార్య.— నాథా! నామనవి నాలకింపుఁడు.

సీ॥ ప్రాణేశ! నన్నిట్లు వారింప నేటికి నేఁడు నాబలశౌర్య నియతు లెల్ల
నెఱిఁగింప మీకు నే నిటులఁ గోరితిఁగాని యుద్యానవనమని హృ
ద్యమైన
మురజస్వనంబని ముదితల సరసోక్తులని కందుక క్రీడలనియుఁ
గాదు
సంగ్రామరంగ లసద్విశేషంబులఁ దెలియక మిమ్ము ప్రార్థింప లేదు

తే॥గీ॥ కైకయును సత్యభామయు లోకవినుత
యశముఁ గాంచిన కారణ మరయ నేది!
వారు తలపోయ నబలలు గారె! కాన
నాథ! యంగీకరింపరే నాదు మనవి॥

ప్రాణేశా! శౌర్య సాహసంబుల చేనొప్పు మదీయ గుణ కథనంబునకు జనులు విస్మయమునొంద, విమలయశంబుఁ గాంచుటకును దామలసి సొలసియున్నప్పుడు భవత్సమీపముననుండి తమకు సేదదీర నుపచారం బొనరించి పతివ్రతా



రత్నమనిపించుకొనుటకుఁ గోరితిఁగాని యన్యంబుగాదు. కైకేయీ సత్యభామాది హిందూసుందరులలోనే యంతటి ధైర్యశాలినులుండ నింకమనవారి సంగతిఁ జెప్పనేల?

భర్త.— నారీలలామ! ఇట్లని యూహించితివా! ఇంకొకటి వినుము.

ఉ॥ మానిని! వారు భూవరకుమారిక లంతియెకాక ధీరతన్
మానితయుద్ధవార్తలను మానక పిన్నతనంబె యాదిగా
నా నలినాయతాక్షు లతిహర్షముతో వినుచుండ్రుగాని నీ
వానని బైలుదేరఁ గలనైనను గాంచితివే రణంబులన్॥

తలోదరీ! యుద్ధంబన నెద్దియో నీవు కలనైనఁగని విని యుంటివా?

భార్య.— ఏల వినియుండలేదు!

భర్త.— ఎవరివలన?

భార్య.— తమవలననే.

భర్త.—ఓహో! నావలన విన్నవార్తలకే యుద్ధంబునకు సన్నద్ధురాల వైతివా? అట్లయిన నింకఁ జాలు నిచ్చట భద్రంబుగా నుండుము. అంతియేచాలు, నేనేఁగెద.

భార్య.— మనోహరా! ఇందునకేల మీ రంగీకరింపకుండిరి? మీ రంగీకరించినచో

సీ॥ నెఱవేఱు నాకోర్కె నేఁడుగా యోప్రాణనాథ తేలుదు మహా
నందజలధి
నిరుపమ సాహసాన్వితమతి యీసతి యనుచు లోకులు మెచ్చ నల
రుచుందు
నస్మదార్జిత సుకృతానేక వశమున మిమ్మొడఁబాయని మేటి నగుదు
సంగ్రామమున కేఁగ జంకువారికి నేను సాహసంబును జూపు చాన
నగుదు

తే॥గీ॥ గాన నాపైన మదిలోనఁ గరుణఁబూన
రేల? నన్నుఁ గొంపోయిన నేమిసేగి?
మఱియు రణభూమి చేరువ మనకుగాదె
ఇందునకు సందియము నొందనేల? యింత॥

భర్త.— కలికీ! నీకుఁగల సమరోత్సాహంబు కొలఁది నిటులఁ బలుకుచుంటివి కాని, నీవలె రణరంగంబున కరుగ నారీమణులెవరును గోరరు. కోరినను గొంపోవు వారును లేరు. కావున నీవిప్పు డనతిదూరంబునగల నీజననీజనకుల గృహంబున సురక్షితముగ నుండుము. నేనును విజయవార్తచే వీనులవిందుఁ గావించి మగిడి పురికిఁగొనివచ్చెద.

భార్య.— జీవితేశా! మీపలుకులను మారువలుక నేరగామి నట్లనే సేయుచున్నదాన. మీరును విజయమును గొనివత్తురను నాసచే నిరీక్షించుచుండెద.

(అని నిష్క్రమించును)

భర్త.— (స్వగ.) అదుగో! నామిత్త్రుఁడు ప్రవేశించుచున్నాఁడు. అతఁడును సమరసన్నద్ధుండై వచ్చుచున్నటులఁ దోఁచుచున్నది.

(మిత్రుఁడు ప్రవేశించి)

మిత్త్రు.— సఖా! ఎచ్చటికి నీగమనంబు?

సఖు.— నీవెచ్చటికో నేను నచ్చటకె.

మిత్రు.— నేను రణంబునకేఁగుచున్నాను. నీవును రణంబునకె?

సఖు.— అవును.

మిత్త్రు.— ఓహో! ఏమీ వింత!

సఖు.— ఇందు వంతగాని, వింతయేమికలదు?

మిత్త్రు.— అవును. బంధు మిత్త్రి పుత్ర కళత్రాది స్వజన వియోగంబునకుఁ గూడ ననుమతించి సమరాభిముఖులౌట దుఃఖకరమె యగు.



సఖు.— అది శౌర్య హీనులకును, నిరుత్సాహులకును గాని మనకు గాదు.

మిత్రు.— అయినను నీయింట నీవొంటరివాఁడవు కదా! నీసతి నెందుంచివచ్చితివి?

సఖు.— జన్మస్థానమునం దుంచివచ్చితి.

మిత్రు.— సంగడీడ! అంతదవ్వుఁ బంపనేల? సమీపమందుఁగల భవదీయ సోదరీ భవనంబునకు బంపకపోయితివా?

సఖు.— చెలికాఁడా! ఈప్రశ్న నీవు చేయఁదగినదియు నేను చెప్పఁదగినదియు నగుఁగాన చెప్పెద నాకర్ణింపుము.

ఉ॥ అచ్చటికేల పంపనన నాజికిఁబోయినవారు క్రమ్మఱన్
వచ్చుట దైవికంబగుట భావమునం దలపోసి నాసతిన్
జెచ్చెర పుట్టినింటికయి చేర్చి మహావిజయాభిలాషినై
వచ్చితి యుద్ధభూమి కిఁక వారక పోదము రమ్ము మిత్త్రమా॥

మిత్త్రు.— (స్వగ.) బాపురె! ఎంతవిచారము! (ప్రకా.) నీధైర్యగాంభీర్యాది గుణంబులు వర్ణనీయంబులే యగుఁగాని యిట్టి యమంగళములఁ బలుకకుము.

సఖు.— ఊరక యట్లంటిఁగాని సర్వమంగళప్రదాయిని యగు లోకమాత ముందు నడుచుచుండ మనకు మంగళముగాక యమంగళము కలుగునా?

మిత్రు.— అయినను

తే॥గీ॥ చనుచు నుండిరి పురిఁగల మనుజులెల్ల
రనికి నీవొక్కరుండవు చనకయున్న
నేఁగి యేమియు లేదిందు వేగనీవు
పోవనగునయ్య నిజగేహమునకు మిత్ర॥

సఖు.— ఒహో! నావచనంబులకంటె నీవచనంబులె స్తవనీయంబులు, అందునకు నీ నిరుత్సాహ వాక్యంబులె కారణంబులు. మఱియు

తే॥గీ॥ అనికి రా జంకువారల కధిక శౌర్య
ముప్పతిల్లు వాక్యంబులఁ జెప్పకిట్లు

ఘనతరోత్సాహమునను సంగ్రామమునకు
వచ్చువారిని వారింప వచ్చునయ్య॥

మిత్రు.— (స్వగ.) ఆహా! ఏమి వీని మనోధైర్యము! (ప్రకా.) సుహృద్వరా! అటు లయిన సమరభూమిఁ జేరుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## ద్వితీయ రంగము, గృహము.

(ప్రవేశము) వీరమాత, ధైర్యశాలి.

ధైర్య.— (స్వగ.)

తే॥గీ॥ అన్య భూమీశులకు నీ పురాధిపులకు
కలహ మాసన్నమైయున్న కారణమున
నింటికి కనీస మొకరైన నేఁగుదెంచి
శత్రువితతిఁ గూల్చెడఁటంచుఁ జాటిరికద॥

అటుల సాఁటుటంజేసి మదీయ మాతాభిమతంబు వడసి సమరాభిముఖుండ నైతిఁగద. ఇట్లరుగ నచ్చటి యధిపతులు మున్నుగువారు నాయుదంతంబెఱిఁగి వృద్ధురాలగు మజ్జనని కుపచర్యఁజేయ నేనొక్కరుండ నాధారభూతుండ నని తెలిసికొని సంగరంబునకుఁ గొంపోవ సమ్మతింపరైరి.

కం॥ ఆజికి నీ సమయంబునఁ
బోఁజాలక యకట కోలుపోవుచు నస్మ
త్తేజోభిమాన బలముల
గాజులఁ దొడిగించుకున్న ఘనమతినైతిన్॥



ఇఁక వగచిన లాభంబులేదు. కావున నా కాలోచిత కృత్యంబుల నైన నాచరింపఁ జనెద (అని యించుక చేరఁజని పరుండియున్న తల్లిపాదంబు లొత్తుచుండు)

వీరమాత.— ఏమది! వికసిత సుందర వదనారవిందుండగు మత్పుత్రుండు నేఁ డిటుల చింతాకుల చిత్తుఁడై యుండినటులఁ గాన్పించుచుండె. వెండియు రణరంగంబునకేఁగ నిన్న నే నియోగింపఁబడియు నింక నిందు మసలుచుండు కారణంబేమి? ఒకవేళ నిజదేహసౌఖ్యముల విసర్జింపఁజాలక పౌరుష హీనుఁడై యిందు కుందుచుండెఁ గాఁబోలు అయినను నడిగి తెలిసికొనియెద. (ప్రకా.)

ఉ॥ సన్నుత భవ్యశీలుఁడవు శౌర్య గుణుండవు నైన పుత్రకా!
ఎన్నఁడుఁగాని నీ వదన మివ్విధి దుఃఖపయోధి మగ్నతన్
విన్నదనంబు దోఁప నిటు వింతగ నుండుటఁ గాంచనైతి, నేఁ
డెన్నఁగ నిట్టులున్నకత మెయ్యదియో యెఱిఁగింపఁగోరెదన్॥

మఱియు

తే॥గీ॥ బవరమున కేఁగు మనుచు నేఁ బంపుకతన
నలుక వొడఁజూపె నొక్కొ నీ వనికిఁబోవ
నరివితానావలోకంబు వెఱపుఁ గొలిపె
నొక్కొ! యేటికి నేఁడిటు లుంటివయ్య?॥

ధైర్య.— అమ్మా! యేమి చెప్పుదు!

తే॥గీ॥ అప్రగల్భు నపారవిద్యయును లోభి
వానిధనమును భీతాత్ముఁడైనవాని
బాహుబలము నా యసమానపౌరుషంబు
నరసి చూడంగ రసభంగ మగునుగాదె॥

వీర.—(స్వగ.) ఆహా! ఏమి వీనిబుద్ధిసౌజన్యము! (ప్రకా.) వత్సా! ఏటికిటులఁ బలుకుచుంటివి? మూఁడుకాళ్ల ముదుసలినైన నేను నిజదేహ సౌఖ్యపరిత్యాగంబున

కైన నోర్చి, పుత్రవాత్సల్యం బించుకైనఁ దలంపక యుద్ధంబునకు నిరాటంకంబుగఁ బోనిచ్చితిఁ గదా! ఇంక నీవేల నీలీల వగలఁ బొగలెదవు?

ధైర్య.— తల్లీ! నీవు చెప్పినదెల్ల వాస్తవంబు. నేనును నభిమాన పురస్కృతుండనై

చం॥ ముఖమున సంగరస్థలికిఁ బోవఁ దలంచుటఁ గాంచి నాహితుల్
ముదుసలికాదె నీజనని? పోరునకీపెఁకేఁబోయితేని యా
ముదుసలి నెవ్వరెవ్విధిని బోషణసేయుదు రంచునాజికిన్
గదలఁగనీయ రైరకట! కావుననాకిఁక శౌర్య మర్హమే॥

తల్లీ! నాగమనంబునకు నీవు నిరాటంకంబు. నే నిక్కంబుగఁ గలిపించినను

తే॥గీ॥ చేతనొకకర్ర యూఁతయై చెలఁగదూఁది
కుప్పవలెఁ దెల్లనై కురులొప్పచుండ
నమరు నీ జరాభార దేహంబు యుద్ధ
రంగమున కేను పోవంగ భంగపఱచె॥

మాతా! నేను రణంబునకరుగ నచ్చటి ప్రముఖులు నాయుదంతంబెఱింగి నీ వతి వృద్ధురాలవనియు నీకు నేనొక్కరుండనే పట్టుకొమ్మనలెఁ బోషింప నాధార భూతుండననియుఁ దెలిసికొని నన్ను సమరంబునకు గొని పోవ సమ్మతింపరైరి. ఆకారణంబున

శా॥ ఔరా! శాత్రవభంజనాభిరతి శౌర్యస్ఫూర్తి నిండారఁగా
ధీరస్వాంతసమేతులై బలియులై దీప్యత్ప్రతాపంబునన్
బోరుల్ సల్పఁజనన్ బురస్థులిపుడేఁ బూర్ణాభిమానంబునన్
శూరత్వంబు జవంబు సాహసమునున్ జూపంగ లేనైతిఁగా॥

అదియేకాక

ఉ॥ వైరులు భీతిజెందఁగ జపాన్నృపముఖుల్ శహబాసనంగ నేఁ
డారయ నాపరాక్రమ బలాతిశయం బసమానధైర్యమున్



బోరునఁజూపలేమిఁగద బూడిదలోపలఁబోసినట్టి ప
న్నీరు తెఱంగునన్ ధరణి నిష్ఫలమయ్యె నిఁకేమి సేయుదున్॥

అటుకావున

ఆ॥వె॥ ఇరుగు పొరుగు వార లేఁగుచుండఁగ యుద్ధ
మునకు వారిఁగూడి చనఁగ లేని
శౌర్యమేల! యతుల సాహస ధైర్యాదు
లేల! నాకుప్రాణ మేల యొడల॥

జననీ! భూరిపరాక్రమోపేతుఁడనయ్యు నీవలెనె నేనును నింట నొకమూల నొదిగి యుండవలసి వచ్చెఁగద!

వీర.— (స్వగ.) ఆహా! తొలుత వీనిఁ దెలియక నిరభిమానియని భావించి తుదకు నేనే నిరభిమాననైతినిగద! వయోవంతులును బలాతిశయులునగు దేశీయుల నేకులు సమరభూమిఁ దమప్రాణంబులనైన నర్పింప వెనుదీయకుండఁగ మెలఁగుచుండ నేమియుఁ జేయలేని యీవృద్ధురాలు సేయఁజాలువారికిఁగూడ నడ్డుసేయుచుండెఁగద! కావున నెటులైన వీనిగమనంబునకు నిరాటంకంబుఁ గల్పించుటయె కర్తవ్యంబు (ప్రకా.) కుమారా! చింతింపకుము. ఏరీతినైన నీయుద్యమంబునకుఁ దోడ్పడెద.

ధైర్య.— అదియెట్లు?

వీర.— ఏమి?

తే॥గీ॥ ఆహవోర్విఁ బెక్కండ్రు రాజాజ్ఞఁ బూని
విగత జీవులౌచుండ నివ్విధిని దృణము
నైనఁ బోలని యీవృద్ధురాలు మడియఁ
గలిగెనేని జపానుకు వెలితియగునె!॥

కావున, తొలుత నే జరాభారదేహంబు నీ కడ్డొనర్పఁగలిగెనో యాదేహమిప్పుడు పరలోకగతమైన నిఁక నిన్నెవ్వ రడ్డొనర్పఁగలరు?

ధైర్య.— అకటా! ఎంతకష్ట మెంతకష్టము! తల్లీ! ప్రాణపరిత్యాగంబుఁ గావించుకొనుదుననియా పలుకుచుంటివి?

వీర.— రేపో మాపో పోనున్న ప్రాణంబుల నిపుడే కోలుపోయిన నష్టంబేమి? జీవంబు లస్థిరంబులుగద! ఎప్పుడైననేమి? మఱియు నిట్టివేళలఁ గృతకృత్యురాలనైతినేని నాకుఁగల యశంబు దిశలయందు తేజరిల్లుచుండుఁగద!

ధైర్య.— తల్లీ! అసంఖ్యాకంబులుగ దేశీయులు సమరంబునకేఁగుచుండ నే నొక్కరుండ నేఁగకుండినను సేఁగిలేదు. కావున నీ వట్లూహింపఁ జనదు.

వీర.— కుమార! నీతలంపు సరికాదు. ఏలయన,

తే॥గీ॥ కట్టెలన్నియు నొకటిగాఁ గట్టఁబడిన
విఱువఁ బడకుండునేకాని వేఱువేఱు
కాఁగ విభజింపఁ బడెనేని కన్నుమూసి
తెఱచునంతలో నన్నియు విఱువఁ బడవె॥

కావున నెల్లరునీవలె "నే నొక్కరుండ నేఁగకుండినను సేఁగిలే" దని తలఁచి మిన్నకున్నచోఁ దుదకు పరాజితులగుదురు; కావున నీ విట్లుహింపఁ జనదు.

ధైర్య.— తల్లీ! నీవెంత బోధించినను నామది కుదురకున్నయది; నీవులేకున్న నే నెట్లు బ్రతుక నేర్తు! మఱియు నీవు

తే॥గీ॥ పాలుపంచదారలకన్నఁ బ్రాణమెక్కు
డైన తీపని జగమెల్ల నాడుఁ గాదె
అట్టిప్రాణంబు నకట! సాహసముఁబూని
యెటులఁ గోల్పోవ నుంటివో యెఱుఁగఁజాల॥

వీర.— (స్వగ.) వీనియభిమతంబు వడసి నాయుద్యమంబు నెఱవేర్చుకొనుట దుస్తరంబు; కావున నెద్దియేని నొకయుపాయంబుఁ బన్నెద (ఇంచుక యోజించి తటాలున) (ప్రకా.) ఓహో! ఎవరు నన్నుపిలుచువారు? కుమారా! నీవిందుం



డుము. నన్నెవ్వరో పిలుచుచున్నట్లున్నది. పోయి కనుఁగొనివచ్చెద (అని నిష్క్రమించును).

ధైర్య.— (ఇంచుకనిదానించి) ఏమిది? నా తల్లి "ఇదిగోవచ్చెద" నని చెప్పిపోయి యింతదనుక రాకున్నయది.

(తెరలో)

తే॥ గీ॥ అహాహా! కంటిరె యీవృద్ధురాలు నేఁడు
తనయు ఘనతర విక్రమ స్థైర్య రక్ష
ణంబొనర్పఁగఁ దనదు ప్రాణంబు విడిచె
బాపురే! పౌరులెల్లరు బళియనంగ॥

ధైర్య.— (ఆలకించి భయముతో) ఏమీ! ఆశ్చర్యము! ఈకలకల ధ్వనులేమి? పోయి కారణంబుఁ గనుఁగొనివచ్చెద (అని నిష్క్రమించి దుఃఖముతోఁ దిరిగి ప్రవేశించును.) హా! భువనైక వీరమాతా! మాతా! నాసమ్మతిచే నీతలంపు కొనసాఁగ దనియెంచి పుత్రవాత్సల్యంబు డించి, సాహసంబు మించుటంజేసి నాకన్నుబ్రాపి నీయసువులఁ బాసితివా! అటులఁ బాయుతఱి

మ॥ జననీ! "నాదు గభీర ధైర్యమున వీసంబైన నేఁగాన నీ
తనయం" దంచుఁదలంచితో! మఱియు భీతస్వాంతుఁ డిచ్చోటునన్
జననంబయ్యెనఁటంచుఁ జింతిలితివో శౌర్యంబునున్ వీడి నిన్
గని నీప్రాణవియోగపున్నడికి దుఃఖం బెంతయున్ సైపమిన్॥

గతించినదానికి చింతించినను ఫలితంబు లేదు. మఱియు

ఆ॥వె॥ మాత నేఁడు లోకమాతకు నన్నొప్ప
గించి తాను దిశలకీర్తి వరల
జనెఁగద పరలోక సౌఖ్యముల్ వడయ నే
మోదమున రణాభిముఖుఁడఁ గాఁగ॥

కావున నే నిప్పుడే యపారతర భూరి పరాక్రమాన్వితుఁడనై సమరాభిముఖుఁడనై రిపు భంజనార్థము రణరంగంబునకుఁ జనియెద.

(అని నిష్క్రమించును)

## తృతీయరంగము; అరణ్యము.

(ప్రవేశము) పాంచాలుఁడు, వాచాలుఁడు.

**వాచా.**— పాంచాలా! చూచితివా? 'నెపోలియన్' అను నాతఁడొకఁడైరోపాను దలక్రిందుగఁ జేయ యత్నించియు రుష్యావారితో గెలువఁ జాలకయే కదా మిన్నకుండె. మఱియుఁ గ్రిమియాయుద్ధమునందు రుష్యావారు, ఫ్రెంచి, బ్రిటిషు, సార్డెనియా, టర్కీలతో నెదిరించి పోరాడిరి. వెండియుఁ గొం డొకనాఁడు టర్కీరాజ్యమును డీకొని చక్కఁగ మర్దించెఁగద. అట్టి రుష్యావారేడ! ఈపోరులేడ!

తే॥గీ॥ ఈఁగ తోయధి దాఁటఁబోయిన విధమున
నరసిచూడ నర్థబలము సంగబలము
నించుకయు లేని జాపాను లేడ! రెంట
బలియురగు రుషియావారిఁ గెలుచు టేడ!॥

**పాంచా.**— బలియులైన నేమి! శౌర్యవంతులైన నేమి! నిజోదర పోషణార్థమై యేతెంచిన సైనికులు వీరు! స్వార్థ స్వప్రాణ పరిత్యాగంబులకైన సాహసించి స్వకార్య రక్షణార్థంబై యేకీభూత చేతస్కులై యరుదెంచినవారు వారు! కావున

చం॥ బహుళములగాఁగఁ గూడి యొకపాశమునా నలువై బలిష్ఠమై
యహహా! తృణంబు గట్టదొకొ హస్తికులేంద్రము నట్టులే మహా
మహులులును ధీరవంతు లసమానులునైన జనౌఘమెంతయున్
దహతహలాడి భీతిల నొనర్పఁగ లేదొకొ యేరికైననున్॥



**వాచా.**— అయినను ధర్మమే జయము కదా! అట్టిధర్మమార్గానుచరులు గాక ముందుగాఁ గలహకారణముఁ గలిపించిన వారెవ్వరు?

**పాంచా.**— చెప్పెద వినుము. 'చీమల్పో' రేవులో తమ సైన్యమును దింపుటకు జాపానుల 'యురియూ' నౌకాసేనాధిపతి చనుచుండ, రుష్యావారి 'కోరిట్జు' నావ జాపానుల యురియూపై

ఉ॥ ఘమ్మని యొక్కగుండును తడాలునగాల్చి జవమ్ముమీర ధై
ర్యమ్మునఁగాలుఁద్రొక్కి కలహమ్మున హుమ్మని తారసిల్లు చం
దమ్మున నా జపాను నరనాథుల డీకొని యాక్షణంబునం
దిమ్ముగఁ గారణంబు ఘటియింపఁగనయ్యెను కయ్యమయ్యెడన్॥

అంత "కోరిట్జు"ను జాపానులు తమ టార్పెడోపడవలచేఁ గదలనీయక పోరొనర్చిరి. మఱియు 'అడ్మిరల్ టోగో' అను జపానువీరుఁడు పోర్టార్థరు రేవులోని రుష్యావారి మూఁడు పెద్ద యుద్ధనావలను తన టార్పెడోలతోఁ బగులఁ గొట్టుచు వైరివీరులపాలి మారివలె మెలంగుచుండె.

**వాచా.**— ఏమిది? నీపక్షపాతబుద్ధిఁ బోనిచ్చినావు కావుగద! రుషియనుల జయోత్సవమును గురించి యేమయినఁ జెప్పుదువేమోయని యెంత నిరీక్షించినను దత్సమాచారం బించుకైన విశదీకరింపవేల? జాపానులిట్లు విచ్చలవిడిఁ బెచ్చు పెఱుగుటకు రుష్యావారు నిదురించుచుండిరా యేమి?

**పాంచా.**— చెప్పెద వినుము. జపానుప్రముఖులిత్తెఱంగున నిరర్గళంబుగఁ జరించుచుండ రుష్యావారి సైనికులు

ఉ॥ హాయిగ నాఁటిరాత్రి కుతుకాన్వితులై యొకచోట సాములన్
జేయు జనాళిఁ గాంచు తమి చిత్తమునం దుదయించుట స్వడిన్
బోయి విలాసమొప్ప నటఁ బ్రొద్దును బుచ్చుచునుంటచేతఁ గో
ల్పోయిరి యుద్ధనావలను బుద్ధి జడత్వమె కారణంబుగన్॥

ఇట్లు వారు 'సర్కస్' చూచు వేడుక చేసుండ నిచ్చట వైరివీరులు జయోత్సవంబుచే సముత్సాహులై చెలరేఁగుచుండిరి.

వాచా.—అకటా! ఏమిసోమరితనము! విలాసంబుగ విహరింప వారికప్పుడే తరుణము చిక్కెఁగాఁబోలు! జాపాను లిట్లజాగ్రత్తగా నుందురా! అందుననే వారుల్లాసంబుల నుల్లసిల్లు చుండిరి. రుష్యాసైనికులిట్లు వర్తించినందునకు వారి రాణమువా రేమిచేసిరి?

పాంచా.— రాణమువారీ సోమరుల నిందించి జగదేకవీరుఁడని పేరువడసిన 'మెగ్రాఫు' అను ప్రముఖుని సముచితసేనావితానోపేతుఁ గావించి పంపిరఁట. అతఁడును అవక్ర విక్రమంబునఁ దన పరాక్రమముఁ బ్రకటించుచు 'పీటర్‌పోలావస్కు' అను తనయుద్ధనావపై నెక్కి వెడలెనఁట.

వాచా.— బలె! ఇఁక జాపానుల యాటలు సాఁగవు. తరువాత?

పాంచా.— తరువాతివార్త తెలియదయ్యా.

వాచా.— అకటా! నీవు ప్రప్రథమమునుండియు జాపానుల కృత్యంబుల నాసక్తి నరసినట్లు పెరవారివార్తలంతగ విచారింపవుగద! వారి యుదంతం బిప్పుడెవరు తెలుపుదురు?

పాంచా.— అదుగో! ఎవ్వఁడో యొక రుష్యా ప్రముఖుఁ డరుదెంచుచుండె, నాతనిచే యావద్వృత్తాంతంబు విదితంబు కాఁగలదు.

('సిరిల్' అనుప్రభువు ప్రవేశించును.)

సిరిల్.— బ్రదికితి! బ్రదికితి! ప్రాణంబులఁ జేతఁబట్టుకొని పరువిడి వచ్చుటంజేసి తత్ప్రయాసచే నెచటఁ గోల్పోదునోయని భయంపడు నే నిప్పుడు గదా తెప్పిరిల్లఁగలిగితి!

వాచా.— అయ్యా! మిమ్ములఁజూడ రుష్యాప్రముఖునివలెను యుద్ధరంగమునుండి వచ్చుచున్నట్లును దోఁచుచున్నది. తత్సంగ్రామ రంగమునందలి మెగ్రాఫు పరాక్రమకృత్యంబుల నించుక వివరించి వీనుల విందు సేయఁగలరా?



సిరిల్.— ఎక్కడి మెగ్రాఫు! ఎక్కడి వీనులవిందు!

తే॥గీ॥ కడు పరాక్రమ శాలి సంగ్రామసింహ
మనఁగఁ జెల్లిన మెగ్రాఫు నంతవాని
నిపుణశౌర్య ధైర్యంబుల నీటఁ గలిపె
నౌర యడ్మిరల్ టోగో బలాతిశయము!॥

వాచా.— ఏమది? ఇట్లనియెదవు?

సిరిల్.— అయ్యో! భువనైక వీరుఁడగు మామెగ్రాఫు విజయుఁడ నగుదునను కృతనిశ్చయుఁడయి తన శౌర్య సాహసాది కృత్యంబులు రాణమువారికి తేటపఱచి, సాటిలేని మేటివీరుండను పేరు వడయఁ దన చైదంబులఁ జిత్రించుటకొక్క చిత్రకారకునితో సకల జనాశీర్వాదంబులుఁ జెలఁగ సమరాభిముఖుండయి రణరంగముఁ జొచ్చెఁగాని

కం॥ తన నైపుణ్య బలంబుల
యునికిఁ జిత్తరువు వ్రాయనున్న "వరీషా
గు"ను దానును నీరాకర
మున మునిఁగిన కతన ప్రాణముల విడి రకటా॥

ఆర్యులారా! ఏమిచెప్పుదు! విధికృతంబుమీఱి జరుగదు కదా!

శా॥ క్షేమంబయ్యెడుఁగాక మీకనుచు నాశీర్వాదముల్ సేయలే
దే మారాణమువారు చేసినను నేఁడేమాయె నా దీవనల్
వేమాఱుఁ బగవారి వ్యూహములకు స్థిత్యన్వితస్వాంతులై
మామెగ్రాఫును బాపురే! మడిసెగా మాయాసురంగంబునన్॥

జపాన్ వీరుఁడగు 'అడ్మిరల్ టోగో' యొక్క శౌర్యధైర్యాదులకు వెఱగుపడి వెరవుతోఁ బమి వెఱపుఁజెంది రేవునకు మరలుచు నొకచోట జాపానులు కావించిన మాయాసురంగంబునంబడి మడిసె; జరిగిన యుదంతం బెతిం

గించుటకు కాఁబోలు నే నొక్కరుండ నీటిపాలఁబడక తెప్పిజిల్లి తప్పించు కొని వచ్చితి. ఔరా! ఏమీ! యాయడ్మిరల్ టోగో నిపుణత్వము!

మ॥ బళిరే! యాతని యుక్తిశక్తులు లసత్ప్రౌఢత్వముఁ సాహసా
దుల వీక్షించిన యంత నే రిపులు చేతోవీధి భీతిల్లను
జ్వాలరోషారుణ నేత్రుఁడై జలధిపై సంగ్రామముఁ జేయువే
ళల నా వీరు కడింది చైదముల జాలన్వర్ణనల్ సేయఁగన్॥

పాంచా.—ఇంతవఱకు ధర్మమే జయముకదా!

సిరిల్.— అయినను 'కొజాకు' అను యొకతెగవారు కలరు. వారు మెట్ట యుద్ధమునకు దిట్టరులు. కావున నీటిపై బాకివడ్డీతో మెట్టపైఁ దీర్చఁగలరు.

కం॥ పులిచెంత పిల్లి చెలగా
టలరీతిఁ గొజాకులనికటను జాపాన్వీ
రులశక్తి యుక్తులెల్లను
విలసిల్లుచు నుండుఁగాదె విస్పష్టముగన్॥

వారును జపానుల నింతకుమున్నే యెదుర్కొని పోరు సలుపుచుండిరఁట, కావున రాణమువారి చెంతకేఁగి హెచ్చరికచేసి జయోత్సవంబున కెదురు చూచుచుండెద.

(నిష్క్రమించును.)

పాంచా.—(సంతోషముతో) ఆహా! వింటివా! జాపానుల పరాక్రమాతిశయంబులు సకలజన సంస్తూయంబులు గదా!

వాచా.— ఆ! ఆగుమాగుము! కొజాకుల పరాక్రమం బెట్టిదో!

పాంచా.— గడ్డపలుగులు కొట్టుకొనిపోవుచుండ పుల్లాకుల గతియెట్లున్నదో యన్నట్లు మహావీరులే పరాజితులగుచుండ నింక వీరి పరాక్రమ పరిపూర్ణులు!



వాచా.— అట్లనకుము, (ఒకవంకఁజూచి సంతోషముతో) బలె! ఇటుచూడుము. వికసిత వదనారవిందులై యుల్లాసముప్పతిల్ల వచ్చు యీ రుష్యా ప్రముఖులఁ జూడ విజయవార్తను వేఱ యడుగ నవసరములేదుగదా!

పాంచా.— (నిదానించిచూచి) ఆఁగుము! ఆవచ్చువారు జపాన్ ప్రముఖులుగాని రుష్యావీరులు కారు. కావున జలార్థియై పఱుగిడు వ్యాఘ్రంబు చందంబున విజయార్థమై వచ్చు యుగ్రాకారులగు వీరియెదుట నుండరాదు. వేఱొండుచోట నుండి గతసమాచారం బెట్లైన విననగుఁగాన పోదమురమ్ము.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

(జపానుల సేనానులగు, కురోకి, ఓకు, ప్రవేశము.)

కురోకి.— మిత్రమా! ఓకు! నీవెట్లు వైరుల డీకొంటివి?

ఓకు.— కురోకి! నీయుదంతం బెఱింగింపుము తదుపరి నావృత్తాంతంబుఁ దెలిపెద.

కురో.— అటులైనఁ జెప్పెదనాలకింపుము "యాలూ" నది దాటి కొరియా సమీపించితి నంత

తే॥గీ॥ రెండుపదులవేల కొజాకు దండుతోడ
నిండురోషాగ్ని లోలుకఁగ మండిపడుచు
సాహసమున రుష్యావారి సైనికులకు
నాథుఁడైన సెసావిచ్చు నన్నుఁ గదిసె॥

ఓకు.— తరువాత?

కురోకి.— తరువాత,

కం॥ ఈరీతి నన్నెదుర్కొనఁ
గా రుష్యానాయకుండు కడుగర్వాంధుం

డై రాఁగ వానితో నేఁ
బో రొనరించితిని కడిమి మూఁడు దినంబుల్॥

ఓకు.— శెబాసు పిమ్మట?

కురో౯కి.—

ఉ॥ అప్పుడు నే రణార్ణవము నందు మదీయమతిన్ బరాక్రమం
బుప్పతిల్లంగ శాత్రవుల యుల్లము లెల్లను దల్లడిల్లఁగన్
దెప్పలరీతిఁ దజ్జలధిఁ దేల్చుచు ముంచుచు నేర్పుమీఱ నా
యప్పొలముంచినాఁడ నభియాతి వితానము నెల్లనావలన్॥

ఇవ్విధి నురుమాడి యిరువదెనిమిది ఫిరంగులఁ గొనివచ్చితిఁ జూడుము (అని చూపును.)

ఓకు.— ఇఁక నా యుదంతం బెఱింగింతు నవధరింపుము.

తే॥గీ॥ అరయ మంచూరియాకు పోర్ట్ఆర్థరునకు
రాకపోక లొనర్ప నేర్పఱిచినట్టి
ధూమశకట మార్గంబులఁ దుత్తునియలు
గాఁగ ఛేదించినాఁడ నాకాశలమున॥

అంతట మిన్నకుండక

తే॥గీ॥ ఎట్టికానలనైన దహించునట్టి
వహ్నిరీతి నెంతటి వీరవరులనైన
నరకు సేయక సంగ్రామ సాగరమున
మించువేడుకఁ బగతుర ముంచినాఁడ॥

ఇటుల విజృంభించి వేలకొలఁది శత్రుసైన్యంబుల నిర్మూలముఁ గావించుచు డెబ్బదెనిమిది ఫిరంగులను కొన్నికోటలను స్వాధీన మొనర్చుకొని వచ్చితి.



కురో.— జగదేకవీరా! నీసాహసం బసమానంబుగదా! ఇఁక రణరంగంబునందలి వ్యయంబులకు ధనంబు కొఱతపడియెనఁట. కావున తదర్థంబై పౌరులకు బోధించి యుద్ధరంగమునకు ధనము నంపుదము రమ్ము (అని నిష్క్రమింతురు.

గద్య.

ఇది శ్రీమత్ప్రాలేయాచలజా పాదారవింద
మకరందాస్వాద సానంద హృదయేందిందిర
శ్రీరామన్వయ దుగ్ధపయోధి సుధా
కర గంగయాఖ్య పుత్ర వీరబ్ర
హ్మాహ్వాయ ప్రణీతంబైన
జపానీయమునందలి
ద్వితీయాంకము.









# జపానీయము.



## తృతీయాంకము.

### ప్రథమ రంగము.

కోబేనగరములోని ధనాగారసభ (ప్రవేశము: సభాపతి, సభ్యులు)

సభా.— సభ్యులారా! ఇప్పుడు జరుగుచుండిన కల్లోలవార్తలెల్ల మీరెఱింగినవియే గదా! ఆసంగ్రామమునందలి వ్యయంబులకు వలయుధనంబు లేమింజేసి ద్రవిణావసరంబని జపాను ప్రముఖులు ప్రకటించి యుండుటయు మీరెఱింగియే యుందురు కావున మన మిప్పుడు రణయోధులవలె స్వప్రాణ పరిత్యాగంబు సలుపఁ జాలకుండినను స్వార్థపరిత్యాగంబునైన సలిపి వీరవరులకు హెచ్చరిక సేయనగు, నందులకు మీ రీయఁగలిగిన విత్తంబును వేర్వేఱఁ బేర్కొనుఁడు.

1 సభ్య.— అయ్యా! మీరు వాక్రుచ్చిన విధంబు కర్తవ్యంబు. కావున నా సామర్థ్యంబు మీరెఱింగినదియే కదా! అయినను నే నిడు విత్తంబుఁ దెలిపెదఁ జిత్తగింపుఁడు.

కం॥ పలుమాటలేల నాయొక
నెలసంపాదితము నెల్ల నేనిప్పుడు ని
శ్చలమతి నాజికి వలసిన
సెలవులకై యర్పణంబుఁ జేయుచునుంటిన్॥

2 సభ్య.—

తే॥గీ॥ వినుఁడు త్రికరణశుద్ధిగ విన్నవింతు
నస్మదర్థమం దర్థంబు నాహవోర్వి
వ్యయములకు గాను పూర్ణభావంబుతో నొ
సఁగుచున్నాఁడఁ గైకొండు స్వల్పమనక॥

1 సభ్య.—(సభాస్థిత వితంతు వొకర్తుక మాటిమాటికి ముందునకు వచ్చుటఁ జూచి) సభాధ్యక్షా! ఈపెను వీక్షించితివా?

చం॥ ఎలమి నిదేటి యాతురత! యీపె యొసంగెడు రెండు మూఁడురూ
కలకె మహాభిమానవలెఁ గన్పడుచున్ ఘనకౌతుకాన్వితో
జ్జ్వలితముఖారవిందయయి సాహసమొప్పఁగ నిప్పు డీసద
స్యుల నిటు దాటివచ్చుటను జూచితిరే! విపరీతమయ్యెడిన్॥

అయిన నిత్తఱి నిత్తరుణి యొసంగు విత్తంబు మొత్తమెంతయై యుండునో యడిగి తెలిసికొననగుఁగనుక నడిగెద.

కం॥ వనితా! యీవెసఁగు మహా
ధనమునకై యేల యింత తత్తరపడెదే
వని కిప్పుడీయఁగలిగిన
ధనమును వివరించి చెప్పుము దాచక వేగన్॥

వితంతువు.—అయ్యా! నాపతి బౌద్ధాలయ పూజారి; ఆయన తన యవసానకాలంబునఁ దొమ్మిదివేలరూకలసంచి నావశముఁజేసి దేశరక్షణార్థంబై వలయువేని వ్యయమొనర్పుమని నియోగించి తాను పరలోకగతుండయ్యె. నేనును వానియర్థాంగినగుటంజేసి తదర్థంబిడ నా విధియయ్యె నట్లొసఁగ నసమర్థురాల నగుటచే వగచి యెట్టకేలకొక్క వేయిరూకలను మాత్రంబు సమకూర్చి పదివేల రూకల నిచ్చుచున్నదానఁ గాన సంశయింపకఁ గైకొనుఁడు

(అనినిష్క్రమించును.)

1 సభ్యు.— ఏమి ఈమగువ తెగువ?

శా॥ ఆహా! యీ యభివంద్య నిస్తుల వదాన్యం బద్భుతంబయ్యె. నేఁ
డూహింపంగ నశేషధీనుత సదుద్యోగార్థమై లోన సం
దేహంబు న్వహియింప కీవనితయుఁ నిశ్చింతతో నాహవ్రా
తాసహం బుప్పతిలంగ నిచ్చెఁగద విత్తంబింత పెన్మొత్తముఁ

(ఒకదెసఁ జూచి) ఆ వచ్చునది మనప్రభుపుత్రునివలెఁదోఁచుచున్నది. అంతి
యేగాక యేదియో కొన్నిసరకుల విక్రయించువాని వలెను దోఁచుచున్నది,
ఏమిచిత్రము! అయినను వానియుద్యమంబుఁ గూడ విందము.

(ప్రభుపుత్రుఁడు ప్రవేశించును.)

ప్రభు.—

కం॥ సోడా లెమ్నెడ్కాఫీ
బీడీల్ బిస్కొతులను వివిధవస్తువులఁ
నేఁ డమ్మఁదెచ్చితిని మో
మోడిం గొంపోవరారె పురజనులారా॥

సభా.—బిడ్డా! ఎండనైన కన్నెఱుంగక దాసదాసీజనహస్తపల్లవంబుల మెలంగుచు
నిప్పుడేతాదృశకోమల గాత్రంబు గాసిల నీకర్కశపదార్థంబుల శిరంబు
పై నిడికొని యిటు లమేయ పరిశ్రమాన్వితుఁడ వగుటకు హేతువేమి?

ప్రభు.— దేవా! చెప్పెద నాకర్ణింపుఁడు.

తే॥గీ॥ ఇటుల నే గడించెడి విత్తమెల్ల నాజిఁ
గొఱతవడియెడి వ్యయములకొఱకె యగుట
నిత్తఱిని సేవచించెడి విత్తమిచ్చి
కొనరె యీపదార్థంబులఁ గొసరకిపుడు॥

మఱియు



ఉ॥ ఓయభిమానలాంఛనగుణోజ్వలసాహసులార నాపయిఁ
బాయని కూర్మిఁగల్గి నిరపాయకరంబులు సౌఖ్యదంబులౌ
యీ యకలంకవస్తుతతి నింత వెలా! యని మీమాంసంబులం
దీయెడ సంశయింపక రహిఁ గొనిపోరె మదీయసన్నిధిఁ॥

1 సభ్యు.—వత్సా! ఈసోడాబుడ్డి వెల యేమి?

ప్రభు.— రెండణాలు మాత్రమె.

1 సభ్యు.— అటులైన నొకబుడ్డి నిమ్ము (అనిపుచ్చుకొని డబ్బిచ్చును.)

2 సభ్యు.— బాలకా! ఈలెమ్నెడ్వెలయేమి?

ప్రభు.— మూఁడణాలు మాత్రమె (అనియిచ్చును.)

3 సభ్యు.—కుమార! ఈబిస్కొతు వెల యెంత?

ప్రభు. —అయ్యా! ఆఱణాలు మాత్రమెయగుఁ గైకొనుఁడు (అనియిచ్చును.)

4 సభ్యు.— బిడ్డా! ఈబీడీ యెంత?

ప్రభు.— ప్రతిదియు నొక్క యణాయుండును.

4 సభ్యు— ఎంత వెల చెప్పినను మారువలుకక స్వీకరింతు, నీయుద్యమంబునకు సంత
సిలితి. నంతియేచాలు (అనిపుచ్చుకొనును.)

ప్రభు.— (సభాపతిని సమీపించి) ఆర్యా! ఈదినంబున నేను రణవ్యయంబులకై
మూఁడురూక లిచ్చుచున్నాఁడఁ గైకొనుఁడు.

(అని యిచ్చి నిష్క్రమించును.)

1 సభ్యు.— సభ్యులారా!

తే॥గీ॥ అరయ నాబాలగోపాల మఖిలజనము
లిత్తెఱంగున నసమాన చిత్తులగుచు
స్వార్థజీవపరిత్యాగ మైననోర్చి
పరఁగుచుండుటఁ గాంచ నబ్రంబు గాదె!

ఆఁగుమాఁగుము, దవ్వులఁ గాంచ నెవ్వర్తుకయో కాని యొక్కపూఁబోఁడి యేతెంచుచున్నది. ఇయ్యెడ నయ్యతివ గోడవెయ్యదియో నెయ్యంబున విన నగుఁ గాన సావధానుల రగుఁడు.

(ఒక పతివ్రత ప్రవేశించును.)

పతివ్రత.— ఆర్యా! దీనురాలనగు నామనవి విమల మనస్కులరయి విన వేఁడుచున్నదాన నదెయ్యదియన

తే॥గీ॥ అఖిలజనములుఁ దమశక్తి ననుసరించి
కొంతవిత్తంబు నిత్తుఱేఁ గూర్మితోడ
నొసఁగుచుండంగ నిపుడునే నొక్కకాసు
నైన నొసఁగంగ నసమర్థురాల నైతి॥

సభాసదులారా! అస్మత్ప్రాణప్రియుండు విదేశస్థుండగుటంజేసి యీసమయంబున సంగ్రామమందలి వ్యయంబులకొక్క పైసనైన నొసఁగ నసమర్థురాలనై మానసీయాభిమానంబుఁ గోల్పోవ నున్నందునను భూరిచింతాసాగరనిమగ్ననై తమ కెఱుక సేయ నరుదెంచితిఁ గాని

కం॥ అతులిత విక్రముఁడు జగ
ద్ధిత కీర్తి ద్యుతి వితాన దీపితుఁ డగునా
పతి యింట నున్నచో న
మ్మతిఁ గొనునే ఘనతరాభిమానము విడువన్॥

(తపాలావాఁడు ప్రవేశించి యొక జాబిచ్చును.)

పతివ్రత.— (పుచ్చుకొని) ఈజాబు నాకేనా? (అని యిట్లు చదువును.)

తేఁగీ॥ ప్రేయసీ మన జాప్యాను వీరులిపుడు
శాత్రవులతోడ సమరంబు సలుపుచుంట
వెండియు నపార సంగరోర్వీతలమున
ద్రవ్య లోపమపాటయు వింటిఁ దమ్మికంటి॥



అట్లుకావున

సీ॥ ఇప్పుడు మనపౌరులెల్లరుఁ దమశక్తికొలఁది ద్రివ్యము నొసంగు టనుగాంచి
ఈవు వారివిధంబ నిడ నేమిలేదాయెగా యని చింతిల్లక వినుమొకటి
మన జపాన్దేశమందునఁ గల వనితా జనవితానమందు సౌందర్య దీర్ఘ
తరములై మధుప ప్రకర సాంద్రమేచక కాంతుల నిరసించు కుంతలముల

తే॥గీ॥ వెలయు లలనావతంస మీ వెలఁది యనుచు
మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచిన మెలఁత వీవ
కాన నిప్పుడా కురుల విక్రయముఁ జేసి
తద్ధనముఁ గొంక కొసఁగుమ యుద్ధమునకు॥

(అని చదివి స్వగతమున) ఇది వైదేశికుండగు మదీయ హృదయేశ్వరునిచే లిఖింపఁబడినలేఖ

కం॥ దురమున కీయెడ ధనమిడ
నెరవేమియుఁ దోఁచకిటుల విహ్వల నగునా
శరణిని గని నాదు మనో
హరుఁడంపిన లేఖఁ జూడ హర్షంబయ్యెన్॥

అంతియేకాని (వెంట్రుకలఁ జేతఁబట్టుకొని)

సీ॥ బాల్యమందుండి నా ప్రాణసన్నిభముగఁ గూర్మిచేఁ బెంచిన కుంతలములు
మొగలి సంపఁగి మల్లె మొదలైన సురభితైలాళిచేఁ బెంచిన యట్టి నెరులు

ఒడలిపోషణకన్న నురుతరాసక్తిఁ బెంపలరంగఁ బోషించినట్టి కురులు
నీరద నిర్మల నీల ద్యుతుల భంగి చెలువొప్పఁ బెంచిన లలితకచము

తే॥గీ॥ లిట్టి నాశిరోజంబుల నెట్టులన్య
దీయ కరములఁబట్టి ఖండింపనేర్తు!
మఱియు నిపుడు పౌరుల చెంతకరిగి నేను
బాపురే! యెట్లు విక్రయింపంగనేర్తు॥

(ఇంచుక యోజించి) ఛీ! ఏమీ మౌఢ్యము! ఆబాలవృద్ధులీ యెడను స్వార్థ స్వప్రాణ పరిత్యాగ పరులయి వెనుదీయక నిరంతరము దురంత సంతోష స్వాంతులై వర్తిలుచుండ వలసినప్పుడు పెరుగఁ గలుగు నీకురులకై యింత పరితపింప నేల? కావున జీవితేశ్వరు నాజ్ఞ మౌళి నిడి తదనుసరణవర్తినై కర్తవ్యంబునకుఁ ద్వరపడెద; కావున

తే॥గీ॥ పాయసాన్నాదులిడి తమ ప్రాణవితతి
నెంత పేర్మిఁ బెంతురో యంత కెక్కుడైన
కూర్మిఁ బెంచిన యీ దీర్ఘకుంతలములఁ
జేతులార విక్రయమును జేయనుంటి॥

(అని కురులఁగత్తిరించి)

అయ్యా! ఇదిగో కృతనిశ్చయురాలనైతిఁ గావున నిఁక

తే॥గీ॥ చంచరీకోజ్జ్వలాంచిత చారు చికుర
సమితి నాసక్తి నాథుభక్తి మతిఁ బెనఁగ
విక్రయించెద సముచిత విత్తమిచ్చి
వేగఁ గొంపోరె యో జపాన్ వీరులార॥

సభాపతి.—సాధ్వీలలామ! ఏల యీవేళ నీ నీలవాలజాలంబుల ఖండించి విక్రయింప నుద్యమించితివి?



పతివ్రత.—అయ్యా! యుద్ధంబునకు వలయు సెలవులకు నా పతి యానతిచ్చిన రీతి నిట్లొనర్చుచుంటి; వెండియు

కం॥ వివరింప నీచికురములు
ప్రవిమలతర నీలరుచుల భాసిలుకతనన్
వివిధవిధంబుల ధరఁగల
యువిదల సవరములకొఱకు నుపయుక్తమగున్॥

కావున వలయువారు నేఁజెప్పు విత్తమిచ్చి వేగఁ గొనరండు.

1 సభ్యు.— నారీమణీ! నీ మహోపకార గుణంబునకుఁ బరితోషంబయ్యె నిఁక నీ కురుల వెలయేమి?

పతి.— ఆర్యమణీ! నాయుద్యమం బెఱిఁగి తారే యడుగ వేఁడుచున్నదాన.

1 సభ్యు.— సాధ్వీమణీ! ఇందున కొక రడుగుటయు నొకరు చెప్పుటయు వల యునా? నీవే నుడువుము.

పతివ్రత.— అటులైన నూఱు రూకలీయఁగోరుచున్నదాన.

1 సభ్యు.— ఎంతవెల చెప్పుదువోయని చెవియొగ్గి వినుచుండ నీ మాత్రంబునకే యింతసంశయించితివి? ఇఁక నీవు చెప్పినంత యొసఁగెదఁ గైకొనుము.

(అని రూకలిచ్చి కురులఁ దీసికొనును.)

పతివ్రత.— (రూకలఁదీసికొని సభాపతితో.)

కం॥ అయ్యా! కడువడి జరిగెడి
కయ్యమునకుగాను ధనము గ్రక్కున నిడ నేఁ
డియ్యెడఁ బతిలేమిని నే
నొయ్యన నాకురుల నమ్మి యొసఁగెద ధనమున్॥

(అనియిచ్చి నిష్క్రమించును.)

సభాపతి.— ఆహా! ఏమి ఈమె పాతివ్రత్యము! ఈ నారీశిరోమణి తన శిరోజంబులనైన ఖండించి విక్రయింప సాహసించెఁ గాని దేశంబుపైఁగల కూర్మియు, భర్తపైఁగల భక్తియు, విడువఁజాలదయ్యె.

1 సభ్యు.— బళీ! సభ్యులారా!

చం॥ కనుఁగొనినారె వీటఁగల కాంతలు వృద్ధులు బాలురాది యీ
మనుజవితానమెల్ల నభిమాన మనస్కులె యాట సాహసం
బునఁ బరితోషముప్పతిలఁ బోరున కీ కరణిన్ స్వకీయ జీ
వన ధన ముఖ్యముల్ మదిలవంబును గొంకక ధారవోయుటల్॥

సభాపతి.— దేశీయులిత్తెఱంగునఁ జరించుచుండ విజయంబుగా కపజయం బెట్లు కాఁగలదు? కావున మన మీ ధనమును యుద్ధరంగమునకుఁ జేర్చుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

(యవనిక పడును.)

## ద్వితీయరంగము (అరణ్యము)

అడ్మిరల్ టోగో, జనరల్ నోగి, రుష్యా సేనాధిపతియగు స్టాసల్, విదేశ సముద్ర సేనాధిపతి, ప్రవేశింతురు.

విదేశస.— (టోగోతో) ముల్లోకంబులు తల్లడిల్ల నరివితానంబు నెల్ల నల్లకల్లోలంబుఁ గావించు నీయసమాన పరాక్రమంబునకు సంతసించితిఁ గాన

చం॥ పురుషవరేణ్య! సారమతి ముజ్జగముల్ పరికించిచూడ నీ
సరిగల శౌర్యవిక్రముఁడు సంగర రంగ పరాక్రముండు ధీ
వరనుత ధైర్య ధుర్యుఁడు విభాసిత సాహసభూషణుండు స
చ్చరితుఁడు లేడటంచుఁ గడుఁ జాటెద నెంతయు వీరసింహమా॥



అంతియేకాక నీవు జనంబున విజృంభించి యాజి యొనర్చువేళల

మ॥ అరవిందంబులపాలి చందురుగతిన్ సామోద సంచార బం
భరసందోహముపాలి సంపఁగివలె న్భవ్య ప్రచారాళి సుం
దరియా బర్హియెడన్ ఘనాఘన వితానంబట్ల సంగ్రామ సా
గరమందున్ బడబాగ్నినా రిపులకున్ గన్పింతు వుగ్రుండవై॥

కావున నీచరిత్రంబులు స్తవనీయంబులుగదా!

టోగో.— ఓయివెఱ్ఱివాఁడ! నీవిట్లేల తలఁచెదవు? నే నొనరించు ఘనకార్యంబెద్ది? రెండుదినంబులలో నాలువేల పగర సైన్యంబును సాగరాభ్యంతరంబున ముంచినందునకా నీ వింత పొగడుచుంటివి? ఈ మాత్రంబునకే యింత కొనియాడుచుండిన నీవు మా వీటఁ గల శూరులొనర్చు పనులకెంత సంతసింతువోకదా! నాకన్న మిన్నలగు పరాక్రమోపేతులు వేనవేలు గలరు. కావున నా వింత దైవశక్తిముందు నాశక్తి యెంతలోనిది?

స్టాసల్.— (నోగితో) అయ్యా! పగవారి కోటలను వశమొనరించు కొనుటయందు నీ హస్తలాఘవమునకు మెచ్చితిఁగాని, నీసుతు లీల్గినందునకు చింతిల్లద.

జనరల్ నోగి.—(స్వగ.) ఏమీ మౌఢ్యము! ఈతండు దారపుత్రాది సంసారంబుపైఁగల యనురాగ బంధంబుఁ ద్రెంపకయే రణరంగంబునఁ జొచ్చి యొడలదాఁచుకొని మెలఁగువాఁడు కాఁబోలు! కూలికివచ్చువాని పూనిక యింతియేకదా! (ప్రకా.) ఓమిత్రమా! సమరంబునకేఁగువారి యసువులు స్థిరాస్థిరంబులుకదా! తత్కారణంబున దురంబునకుఁ బంపునపుడు లేని విచార మిప్పుడేలకలుగును? అయినను నాతనయులలో నొకఁడు "నాన్‌షాన్" యుద్ధములో తనప్రాణ మర్పించి అర్ధరుకోటకు దారిచూపె; వేఱొకండు మీటర్‌హిల్ యుద్ధములో తనజీవమిచ్చి పోర్టార్ధరు జీవంబు నిశ్శేషంబుగఁ బీల్చివేసెఁ గావున నాపుత్రులు గౌరవపాత్రులై తండ్రినైననాకు యశోహర్షంబులఁ గూర్చి వారు శాశ్వత కీర్తిచే నుభయలోకంబుల విభవోజ్జ్వలులై యుండ మడిసిరనుటెట్లు? వెండియు "కమ్యాండర్ హీరోసి" అను ధీరుఁడు పోర్టార్ధరు ద్వారమును మూయుట

నై పోయి రుష్యావారి టార్పెడోచేఁ గొట్టఁబడి తిరిగి వచ్చుచు కోటనుండి వచ్చు తుపాకిగుండుచే మడిసెను. ఈతఁడు అవక్రవిక్రముండు, ఆహవదోహలుండు, అతిశాంతుండు, అతిధీరుండు, అత్యంతబలాధికుండు, అనుపమసుగుణాన్వితుండు, అట్టివానికైన మేము వగవలేదే! నా నిసువు లిరువు రీల్గినందునకు మీరు చింతిలుచుండిరి. మఱియు బిగులూఁదువానిని నిష్కారణంబుగ రుష్యావారు చంపినందునకు వాని జనకుఁ డీసున రోసమూని దేశీయులకు మఱింత హెచ్చరికఁజేసెఁగాని నీవలె నిసుమంతయుఁ జింతిలఁడయ్యె నింతియే కాక అనురాగపాశవశుండై రణంబున ముందువెనుకలకుఁ జూచువానికి విజయంబు లభించునా!

టోగో.— ఆఁగుమాఁగుము! ఎవతెయొకాని యొక్క వనితాతిలకంబు శోకాయత్తచిత్తయై యేతెంచుచున్నది. ఆపె కా పెనువంతకేమి కతంబో యొకింత విచారింతము.

(వీరపత్ని ప్రవేశము.)

వీర.— కుమారా!

చం॥ విలసితశీల నీవుకడు పిన్నవె యయ్యును సంగరోర్వి దో
హలుఁడవఁటంచు నీజనకు నగ్రజునామములం ధరిత్రిపై
నిలుపఁగ నేర్పరుండవని నెమ్మది నమ్మిక నున్న నాదు కో
ర్కెల నిటు నీటిపాలు నొనరించిచనం దగునయ్య యయ్యయో॥

దివామధ్యమార్తాండ ప్రచండ తేజస్సోపమప్రతాపదీపితా! శౌర్యసాహసాది గుణవిభూషితా! హా సుతా! నను బాసి పోయితివా! అయినను

తే॥గీ॥ ఆవు చేను మేయుచునుంట నరసిదూడ
గట్టుమేయంగఁ జనునె యక్కరణిఁ దండ్రి
యు ననుజుఁడును వీరస్వర్గమునకుఁబోవ
నరకమున కేఁగుదువె నీవు నా కుమార॥



జనకుఁడును సోదరుఁడును సమరస్థలి నీల్గినందునకు భయపడి యింటనొదిగియుండి నావలె గృశింపుచుండక రణరంగంబునందు నీప్రాణంబు లర్పించి వీర స్వర్గాభిముఖుండ వగుటయు స్తవనీయంబెయని తలంచెద.

నోగి.— (స్వగ.) ఓహో! ఈపెసుతుండు సంగరంబున గతించినందునకు చింతిలుచుండెఁగాఁబోలు, నయిన నడిగి తెలిసికొందము. (ప్రకా.) అమ్మా! యేల యీలీల వగలఁ బొగలెదవు?

వీర.— ఆర్యులారా! చెప్పెదవినుడు. రణరంగంబున

చం॥ పతి విగతాసుఁడౌటవిని పల్మఱు దుఃఖపయోధిఁ గ్రుంకుచున్
పితృని ఋణంబుఁ దీర్పఁగల పెద్దకుమారకు డుండెనంచు, నే
కుతుకము నెంది తొల్లిఁగల గోడునువీడి చరించుచుండు నా
సుతుఁడును సంగరార్ణవముఁ జొచ్చి త్రివిష్టప మేఁగె నక్కటా॥

ఇటు లిరువురు దురమున-మరణించిరి

తే॥గీ॥ అంత శౌర్య ధైర్యోద్ధతుండైన పిన్న
కొమరుఁడైనఁ బితౄణంబు సమరభూమిఁ
దీర్పఁగలఁడంచు మదినెమ్మదిని వహింపఁ
దండ్రి యరిగిన త్రోవ నతండు నరిగె॥

టోగో.— ఎంతకష్ట మెంతకష్టము! భర్తనేకాక యిరువురు తనయులనుగూడ కోల్పోయిన యనదవగు నీకు విచారము లేదనరాదు; అబలవౌటచే యుద్ధమునకుఁ బంపునపుడే విలపించియుందువు. కావున నిపుడు శోకించు టరిదికాదు.

వీర.— ధీరాగ్రేసరా! 'జాతస్య మరణం ధ్రువం' అనునట్లు పుట్టినవారెల్లరు గిట్టుట యనుభవనీయాంశంబేకదా; కావున నేనందులకై వగవ

టోగో.— మగువా! మఱింకేటికి వగవ?

వీర.— వాక్రుచ్చెద, నాలకింపుఁడు.

కం॥ మగఁడు సుతులు నీల్గుటకై
వగవ, మరిం కేటికనఁగఁ బగతురనెల్లన్
మగటిమి రణమున నెదిరిం
పఁగ వేఱొకసుతుఁడు లేమి వగచుచునుంటిన్॥

టోగో.— ఓవీరురాలా! కనుఁగొంటిరా! మాపురిఁగల వనితాజనంబు లిత్తెఱంగునఁ జరించుచుండ మాకార్యంబులేమో ఘనంబులని మీ రెన్నుచుండిరి. వెండియు దేశీయులకు దేశపాలకులయెడఁగల భక్తిశ్రద్ధలఁ జూచితిరి కదా! యిక ప్రభువులు సేవకుల యెడలను సేవకులు ప్రభువులయెడలను మెలఁగు విధానంబుఁ జూచెదరు గాక! రండు. (అని అందరు నిష్క్రమింతురు.)

## తృతీయ రంగము.

### శిబిరము.

(ప్రవేశము.) తుపాకీ చేఁబూని ఫారాయిడు సేవకుఁడు.

సేవ.— ఇంతదనుక నే నీ శిబిరమును గాపాడుచుండిన కారణంబున నాయాఁకలి బాధయుఁ గనుపించదాయెఁగాని

తే॥గీ॥ పనుల వెంబడినే పనుల్ వచ్చుకతన
నించుకేని వ్యవధి లభియింపదాయె
నటులఁగావున నీబుభుక్షార్తిచేత
నొక్క యంజమైన నిలుప నోఁపనోఁప॥

తత్క్షుద్బాధ కారణమున

తే॥గీ॥ చెవుల వినఁ గల్గియును గడు చెవిటినైతి
నేత్రములఁజూడఁ గలిగియు నేఁడు గ్రుడ్డి
నైతి నయ్యయో చిత్తమందరయ మిగుల
చిత్రమయ్యె నాఁకటి బాధ సేఁతలకును॥



అంతియే కాక

మ॥ తడిలేదయ్యెను నాదు జిహ్వపయిఁ జిత్తం బెంతయున్ శోషచేఁ
జెడియెన్ వెండియు నేత్రయుగ్మమునకుం జీఁకట్లు గ్రమ్మెన్గటా!
ఒడలెల్లన్ దత ఘర్మవారి యుతమై యొప్పారె నా కియ్యెడన్
గడియే యెన్నఁగ నొక్కవత్సరముగాఁ గన్పించె క్షుద్బాధచే॥

అబ్బా! యీయాఁకటి బాధ కెట్లుసైతు, నటుల సైపఁజాలకుండినను నా యుద్యోగంబునఁ బ్రాలుమాలఁ జెల్లునా?

చం॥ ఇటులదురంతవంత లభియించిన వేళల యందు సైతమున్
భటులగు వారలేలికల భావమెఱింగి మెలంగ కన్యథా
చటుల జడత్వమానసము సంధిలఁగా నిజసౌఖ్యలోలతన్
పటుతరలీల వారి కనుబ్రామఁదలంచుట చెల్లదేరికిన్॥

అంతియేకాక

కం॥ కన్నట్టి తల్లిదండ్రుల
కన్న నమేయానుకంప కడలుకొనంగా
నెన్నుకొను ప్రభుల యానతి
సన్నుతి యొనరింప మౌళిఁ జనదే తాల్పన్॥

ఏతాదృశ ధర్మావలంబిత చిత్తంబుచే నస్మద్విధ్యుక్త కార్యాచరణ పరత్వంబున నుంటినేని యీదుర్భర బుభుక్షార్తి సహించుట కడు దుస్తరము. మఱియు

తే॥గీ॥ నోటఁ దడియారుకతన నామాటలెల్ల
బాలకుల తప్పటడుగుల వలెను మిగులఁ
దొట్రువడుచుండె మదికేమి తోఁచదాయె
నకట యెటులోర్తు నింక నీయాఁకలికిని॥

అయినను నీ యాయుధంబు నిచ్చోటనునిచి యొక్కఁకను నెప్పపాటులో నాయాఁకటి బాధఁదీర్చుకొని వచ్చెద(తుపాకినచ్చోటనునిచి కొంచెమావలకేఁగి) ఛీ! ఏమీ! యీబుద్ధిమాంద్యము! ఈ నిర్జరస్థానంబునఁ గావలి వారెవ్వరును లేనితఱి నా నిజోదరపోషణార్థమై యరుగనుద్యమించితినిగా?

కం॥ కావలిఁగాయక యిపుడే
నావలికేఁగుటను గన్న నరివర్గముచే
నేవిధినైన విపత్తులు
రావే, మఱి మీఱి నగునె ప్రభువుల యాజ్ఞల్॥

అందుచే నిప్పటినాతలంపు సరికాదు (తిరిగితుపాకిఁదీసికొనిఫారాయిచ్చుచు)
అయ్యో! నాయాఁకటి బాధ మాటలసందుననైన మఱపురాదయ్యెఁగద!

తే॥గీ॥ చమురు లేనట్టి దివ్వె యేసరణి చంచ
లించుచుండునో యిపుడట్టులే మదీయ
పంచప్రాణముల్ మిగులఁజలించుచుండెఁ
దగిన యాహార మిడని కతాన నకట॥

(అనిచతికిలఁబడియిటునటుఁజూచి)అదుగో!భోజనశాలకేఁగ మాయధిపుఁడీతెరవున నే వచ్చుచుండెఁగాన నే నిత్తెఱంగున బలహీనునివలె మెలఁగ జెల్లదు.

(అనిజవంబునలేచి ఫారాయిచ్చుచుండును)

(మార్క్విస్ ఒయామ ప్రవేశము.)

ఒయామ— (స్వగ.) ఏమిది! భూరి బలశౌర్యోద్ధతుండగు నా సేవకుండు నేఁడిట్టుల ముకుళిత వదనారవిందుఁడై నిరుత్సాహునివలెఁ గనిపించుచున్నాఁడు. కారణంబునడిగి తెలిసికొనియెద. (ప్రకా.) సేవకా! నేఁడు నీముఖవికాసము చెడి యిట్టులుండుటకు కారణంబేమి?

సేవ— అయ్యా! మఱేమియు లేదు, నే నెప్పటియట్ల నేయుంటిని.



ఒయామ—కాదు, కాదు. నీవెద్దియో యొక విపదంబుధి మునిఁగినట్టులఁ దోఁచుచున్నది, కాన జడియక నుడువుము.

సేవ.— దేవా! మీవంటి ప్రభువుల చెంత సేవకవృత్తి నున్న భృత్యులకొకప్పుడైన విపత్తులు వాటిల్లునా?

(అని దైన్యము వీడి పచారుచేయుచుండును).

ఒయామ.— ఓయి! నీముఖ వికాసము నీకృశీభూతదేహము నీవు చెప్పకున్నను జెప్పించుచునేయున్నవి కాన దాఁచక నిక్కమెఱింగింపుము.

సేవ.— ఏటికి నన్నిటులఁ గ్రుచ్చిగ్రుచ్చి యడిగెదరు?

కం॥ అయ్యో! సోమరినై నే
నెయ్యెడనైనన్ ద్వదీయహితకార్యములన్
నెయ్యమున నాచరింపక
యియ్యెడలను దాఁచుకొంటినే యోయధిపా॥

ఒయామ.—సేవకా! నీవు సోమరివనియు నొడలు దాఁచుకొని పాటుపడువాఁడవనియు నడుగుచుండలేదు. కాని యేదియో యొక యాపదలో నుండిన నెఱింగి తన్నివారణం బొనరింప నడుగుచుంటి; దాఁచక చెప్పుము.

సేవ.—మహాప్రభో! ఇంతదనుక నాహారంబుఁ గైకొన విశ్రాంతి చిక్కమి నిట్లుంటిఁగాని వేఱొద్దియు లేదు. మఱియు నొక్కముహూర్తమాత్రంబునకు వేఱొక సిపాయి రాఁగలఁడు; నాకపుడు వ్యవధి కలుగఁగలదు.

ఒయామ— ఆ! ఇంతవఱకు నిరాహారివై యుంటివా? ఇఁకఁజాలుఁజాలు, నాకై యాయత్తపఱుపఁబడిన భక్ష్యమును భుజించి నీబుభుక్షఁ దీర్చుకొనిరమ్ము, నేను నీమారుగ నిటనుండెద.

సేవ.— అయ్యా! ఆఁకలివేళ మించుటంజేసి నాకంత యాఁకలిలేదు కాన వేఱొండు సేవకుఁడు వచ్చువఱకు నేనుండఁగలను, మీరుభోజనశాలకేగుఁడు.

ఓయా.— ప్రాణావశిష్టుండవై నా పలుకులకుఁ బ్రత్యుత్తర మీయఁగలిగితి వంతియే చాలు. ఇఁక నామాటలకు మాఱాడక శీఘ్రంబుగఁ బోయి నీ యాఁకలిఁ దీర్చుకొనిరమ్ము. (అని తుపాకిఁ దీసికొని ఘారాయిచ్చుచుండును.)

సేవ.— (ముందుకు వచ్చి)

ఉ॥ కాంచఁగ మోదమయ్యెఁగద కన్నతనూజుల భంగి నిట్లు ప్రే
మాంచిత మానసంబున నహర్నిశము న్మముఁ బ్రోచుటల్ విలో
కించిన సేవకాళియు స్వకీయ విపత్తుల నైన నైఁచి సే
వించు టదొండుగాక కడు వేడ్క వినమ్రులుగారె వీరికిన్॥

భృత్యుల యెడలఁ బుత్రవాత్సల్యంబు వహించి పరిపాలించుచుండ నిట్టిప్రభువు లచెంతఁ దమప్రాణంబులర్పించి పాటుపడక కపటోపాయంబులచే మెలఁగఁ బ్రయత్నించు భృత్యులుందురా? మఱియు

తే॥గీ॥ విమలతర భక్ష్య పాయసాన్నముల చేత
నమరినట్టి నాయధిపు పదార్థ వితతి
భుక్తిచే నీ బుభుక్షార్తి ముక్తమగుఁగ
నెంతకష్టంబునకు ఫలమంత కాదె॥

కాన నాయాఁకలిఁ దీర్చుకొని వేగవచ్చెద. (నిష్క్రమి.)



## తురీయ రంగము.

### రుష్యాంతిక ప్రదేశము.

(ప్రవేశము) ఇద్దఱు సన్యాసులు.

1 సన్యా.—మనరూపంబు లిపుడు నిశ్శేషంబుగ మారిపోయినవి కదా!

2 సన్యా.— అవునవును. సర్వపరిత్యాగులగు బైరాగులుగనే భావింతురు కాని వీరు జపాన్ దేశస్థులనియు, వేషధారులనియు మనలఁగాంచియెవరును భావింపరు.



1 సన్యా.—సత్యము. ఇఁక మనప్రయత్నంబు సఫలంబగు టెట్లు?

2 సన్యా.—చెప్పెదవినుము. నేనీరుష్యావారికి కొంతహితోపదేశంబు సేయుచు యదార్థంబుగ మనమువిరాగులమై వచ్చిన సన్యాసులమని విశ్వసించునట్లొనర్చుచు నీకు సమయంబెఱింగించెద నంతనీవు కర్తవ్యకార్యాచరణమందు నేర్పరుఁడవై మెలంగుము.

1 సన్యా.— నేనెంత నేర్పుతో మెలఁగినను "వాల్గా" నది చెంతకుఁ బోయి యానది కడ్డముగాఁగల వంతెనను బగులఁ గొట్టుతఱిఁగలిగెడి మహాధ్వనికై మనకేదేని యుపద్రవంబు కలుగునేమో యనితోఁచుచున్నది.

2 సన్యా.— అందునకు సమ్మతించియేకదా యింత దవ్వరుదెంచితిమి. ఎప్పటికిని జీవంబులు స్థిరంబులుకావుగదా!

1 సన్యా.— అవును (దిక్కులుపరికించి చూచి) అదిగో రుష్యాజనులు గుంపులు గుంపులుగాఁ గూడి యిచ్చటికేవచ్చుచున్నారు. ఇఁకమన యీప్రసంగంబుఁజాలించవలెను.

(రుష్యాజనులు ప్రవేశింతురు.)

1 రు.— (తమలో) ఈయిరువురెవరోకాని వింతగఁ గనిపించుచున్నారు!

2 రు.— వీరు సంసారంబురోసి సతీసుతాదుల బాసి ఘోరాటవులఁడాసి ముముక్షువులరై భక్తియుక్తంబుగ భగవంతునారాధింపుచు నప్పుడప్పుడు జనుల హృదయకంజంబులు రంజిల్లునటుల మంజుల వాక్ప్రౌఢిమచేఁ బరమ పద మార్గంబుపదేశింప నిట్లరుదెంతురు.

3 రు.— .మనము వీరు నుడువునట్లొనరింపఁ జాలకుండినను వీనుల విందుగ విననైన విందము (సన్యాసులతో) ఓపుణ్య పురుషులారా! మీరెవ్వరు? ఇచ్చోటికేమిటికిమీరాక?

2. సన్యా.—పౌరులారా! సంసారంబు నిస్సారంబని యెంచి సారపూరంబగు మోక్షంబుపై కాంక్షగలవారము మీకును దత్క్రమంబెఱింగింప వచ్చినారము.

1 రు.— మేమును మీనుడువుల వినఁగోరుచు నేయున్నాము. కావున నిఁక నానతిండు.

2 సన్యా.— మీరెల్లరు నాసీనులరయి సావధాన చిత్తంబుల నవధరింపుఁడు.

పౌరులు— (కూర్చుందురు.)

2 సన్యా.—

సీ॥ కామాదిసుఖములఁ గాంచుచు దేహపోషణకు బాటుపడుచు సంచ
రించు
జంతుజాలంబు లనంతకోట్లకు మించి విలసిల్లుచున్నవీవిశ్వమందు
కానిసుజ్ఞానంబు మానవులకు దక్క నితరజీవికి లేని కతనగాదె
మానవజన్మంబు మానితంబైన జన్మంబు సమస్త జన్మములకన్న
తే॥గీ॥ నిట్టిమానవ జన్మంబు నెత్తి దైవ
భక్తి యుక్తుఁడుగాకున్న ఫలముకలదె
కాన మానవుఁ డకలంక మానసమున
నీశ్వరజ్ఞానుఁడై చరియింపవలయు॥

2 రుష్యా.— బాగుబాగు! ఇఁక నట్టి సుజ్ఞానంబన నెట్టిదో తెలుపుఁడు

2 సన్యా.—

కం॥ భూమ్యాకాశంబులు నీ
సౌమ్యాదిగ్రహ వితాన సాగర గిరులన్
రమ్యంబుగ సృజియించి య
గమ్యుండై వెలయునట్టి ఘనుఁడెవ్వాఁడో॥

మఱియు

కం॥ ఈ సుషమాన్విత ఋతుమ
లీసకలచరాచరంబు లీ కుజనికరం
బీసరణి నేమహాత్ముని
చే సృజియింపంగఁ బడెనో చిత్రముగాఁగన్॥

అంతియే కాక



తే॥గీ॥ ఆదిమధ్యాంత శూన్యుఁడై యమరెనెవఁడు
భక్తహృజ్జలజపుటాళిఁ బరిఢవిల్లు
నెవ్వఁడట్టి పరాత్పరు నెఱిఁగి కొలుచు
నట్టి చిత్తమె సుజ్ఞానమనఁగఁ జెల్లు॥

అటుపిమ్మట

కం॥ అజ్ఞాన ముడిగి యీదృశ
సుజ్ఞానుండైనవాఁడె సురుచిరలీలన్
ప్రాజ్ఞుఁడు ననఘుండును దై
వజ్ఞుండనఁ బరిఢవిల్లు వసుధాస్థలిలోన్॥

ఇటుల సుజ్ఞానపరిపూర్ణుండయి భగవంతు నర్చింప వలయు, నాభగవంతుఁ డెట్టివాఁడనఁగఁ జెప్పెదవినుఁడు.

సీ॥ లోకాళివినుత ప్రభాకరామలశీతభానుబుుతూదులు లేనియపుడు
కుంభినీవలయంబు నంభోధి నికరంబు క్షోణీధరావళుల్ లేనియ
పుడు
కంఠీరవాది మృగంబులు పులుగులు మానవవ్రజమును లేనియ
పుడు
అంధకారావృతంబై పరికింపంగ లేశంబు నెద్దియు లేనియపుడు
తే॥గీ॥ నిర్వికార నిరాకార నిష్కళంక
నిరుపమామోఘ నిస్సంగనిత్యుఁడగుచుఁ
బరగి నట్టివాఁడే భగవంతుఁడనఁగ
నాది మధ్యాంతశూన్యుఁ డవ్యయుఁడనంగ॥

ఇట్టి భగవంతుని సంసారసాగరంబున మునుంగక విషయాసక్తుండునుంగాక తదేకనిష్ఠాగరిష్ఠుండై ధ్యానించు పురుషుండే పరమపావనుండు.

1 రు.—చాలుఁజాలు! మీరు బోధించు మతంబు మాకు హితంబుగనున్నను నాకుసమ్మతంబుగ నుండలేదు. ఏలయనఁగ

కం॥ దొంగిలియో యొకచో న
ప్పుంగొనియో తృప్తిదీర భుజియించుచు క
న్నుంగవ కింపయి యలరెడు
శృంగారాంగనలఁగూడు టిదెమోక్షమగున్॥

అని పూర్వకాలపు గ్రంథకర్తలయం దొకానొకరు బోధించినటులున్నది. కావున నటుల బోధించినఁ గొంత హితంబుగ నుండును కాని యిదేటి బోధ? తాము సన్యాసులగుటయేకాక మనలఁగూడ సన్యాసులఁ జేయ యత్నించుచుండిరి కాఁబోలు.

2సన్యా.— అకటా! జీవితంబులు క్షణభంగురంబులని యెఱింగియు నీదేహంబుపైఁ గల తమకంబుచే నెఱుంగని వారివలెఁ జంచలంబులగు తుచ్ఛసౌఖ్యంబుల కాసించి నరకకూపంబున మునుంగుచుండిరా? ఇఁక జీవితంబుల తెఱంగెఱింగించెద వినుఁడు

ఉ॥ మేదురదుఃఖభాజనము మేదిని మూత్ర పురీష మాంస ర
క్తాది మలీమసాంగయుతమై యనురాగ భవాఖ్యసాగరం
బీఁదగ లేక నిచ్చలు నహీనభయానక రోగపూర్ణమౌ
యీదృశ దేహంపైఁ దమక మేటికి చెందెద రీరలక్కటా॥

వెండియు

ఉ॥ నమ్మకుఁడీ శరీర చలనమ్ములు నిత్యము లంచు భూరి సౌ
ఖ్యమ్ములఁ జెందువేళల హృదబ్జమునందుఁ గుతూహలంబు క
ష్టమ్ముల నొందువేళల లసద్వ్యసనంబును లేక కష్ట సౌ
ఖ్యమ్ములు రెండు నిచ్చలును గావడికుండలుగాఁ దలంపుఁడీ॥

అంతియేకాని శరీరసౌఖ్యంబులు నిత్యంబులని నమ్మి యాముష్మిక సుఖంబులపై ధ్యానంబులేక సంతసింపఁ జనదు. మఱియు



తే॥గీ॥ ఆలుఁ బిడ్డలు తలిదండ్రు లన్నదమ్ము
లాప్తజనములు భోగ భాగ్యాదులవని
నఖిల మస్థిరంబులు గాని యరసిచూడఁ
బాపపుణ్యముల్ స్థిరములై ఫలము లొసఁగు

కావున నీభూతలమున

చం॥ బ్రతికిన నాల్గునాళ్లు పర పంకరుహానన లోలుఁడౌచు సం
తతమతి దుష్కృతంబుల నొనర్చుచుఁ బాప పయోధిఁ గ్రుంకకీ
క్షితిఁగల జీవకోటిపయిఁ జెన్నగ భూతదయార్ద్రబుద్ధిచే
నతులిత సత్కృపం గనుచు నారయుఁడీ యపవర్గ మార్గమున్॥

ఇటులొనరింపక బుద్ధిమాంద్యంబున విషయాసక్తులైయుండఁజనదు ఏలయన

కం॥ సారవిహీనంబగు సం
సారాకూపార మగ్న జనుఁడీజగతిన్
గోరిమి నపవర్గ పథం
బేరీతిని గాంచనేర్చు నింద్రియ పరతన్

మఱియు సంసారసాగరమున మునిఁగి

కం॥ కామక్రోధాదులచే
వేమాఱును జిక్కువడి వివేక విహీనుం
డౌ మనుజుఁ డేడ? ప్రవిమల
మామోక్షపథంబు నొందు టదియేడ? తగన్॥

రు. 2. —అయ్యా! మానుడువులు సుధాబిందు సందోహంబుల చందంబున వీనులవిందగుచు డెందంబున కమందానందంబు నొందింపుచుండె.

2.సన్యా.— ఇంకను జెప్పెద వినుఁడు, పురుషుండు జన్మావసానపర్యంతంబు నిజసతీసుతోదర పోషణార్థంబై పాటుపడుచుండ వాని యాప్తులు నట్టులే వానిఁ బరివేష్టించియుందురు, అవసానకాలంబునందు సైతము

సీ॥ దుర్భరంబగు భూరి గర్భభారము సైచి తన్ను పెంచిన కన్నతల్లి యేడ్వ
నష్టకష్టంబుల ననుభవింపుచుఁ జిన్నతనమునుండియు సాఁకు తండ్రి యేడ్వ
నతులిత సద్భక్తిఁ బతియె దైవంబని భావించి సేవించు పత్ని యేడ్వఁ
గడుపారఁగని కడుగారవంబునఁ బెంచఁ బెఱిగిన తనచిన్ని బిడ్డ లేడ్వ
తే॥గీ॥ నెందఱెందఱో హితముఖ్యు లేడ్చుచుండ
నిన్ని యేడ్పులు చెలరేగి తన్ను జుట్టు
కొనఁబడెడి వాఁడు మోక్షంబుఁ గోరుటేడ?
కోరి తత్పథంబును దాను చేరుటేడ?॥

కావున నిట్టి మాయాసంసారంబునందు తగులు కొనక సర్వంబు మిథ్యయని యెఱింగి యచంచల చిత్తుండై సంచరింపఁగలవాఁడే ధన్యుండు.

2రు.— పుణ్యపురుషా! ఇటుల మెలంగు వారలకు కైవల్యంబు లభింపఁగలదా?

2సన్యా.— ఇంకొక ముఖ్యాంశంబు గలదు.

2రు.— ఏదది?

2సన్యా.— చెప్పెద వినుఁడు.

కం॥ శుద్ధోదనుని తనూజుఁడు
సిద్ధార్థరుండనంగ సేవితయశుఁడై
బుద్ధుండన విలసిల్లు జ
గద్ధిత చరితుండు నతుఁ డకల్మషుఁ డరయన్॥

ఆపరమపుణ్యుఁడు

కం॥ పరికింపంగ ‘నహింసా
పరమోధర్మం’బటంచుఁ బలికెడి శ్రుతి వా
క్సరణి నెఱనమ్మి నిచ్చలు
ధరణి న్బోధించుచుండుఁ దత్పరమతుఁడై॥



1రు.— అహింసయనఁగ నాకెద్దియో యెఱుకపడలేదు విశదీకరింపఁ బ్రార్థితులు.

2 సన్యా.—అహింసయనఁగ జీవంబుల హింసింపక సకల భూతదయాపరుండయి యుండుటయె. అట్టి భూతదయ యెట్టిదనఁ జెప్పెద. నాలకింపుఁడు(తనసహచరునితో రహస్యముగ) ఒయీ! యిప్పుడీజనులెల్లరు నా వాక్సుధారసంబుచే సంతసించుచు మేనుల మఱచి మనయందనురక్తిఁగలిగియున్నారు, నీవిప్పుడేఁగి సఫలమనోరథుండవై రమ్ము పొమ్ము.

1 సన్యా.—అటుల నేచసెద (అనినిష్క్రమించును.)

2 సన్యా.—సభ్యులారా!

కం॥ మననిజ జీవంబులపై
మనఁకెంతటి ప్రేమకలదొ మనవిధమున నే
మనఁగలుగు సకల జీవుల
కును నంతటి ప్రేమకలదు కువలయమందున్॥

అనియెఱింగి చీమకైనను హానిచేయక యశేష జంతుజాలంబుపై సదయతనుండుటయె భూతదయ యనంబరఁగు నటులఁగాక

చం॥ ఇలనివి యల్పజీవులని హింస యొనర్పఁగఁ జూతు రజ్ఞులై
కలుషమతిన్ మహాఖలులు కాని మనంబునఁ బిన్నవైననున్
వెలయఁగఁ బెద్దవైనఁ గడువేడ్కఁ జరించు సమస్త జీవరా
సులకు సమంబు బాధలనుచుం దలపోయర దేమి చిత్రమో॥

అంతియే కాక

తే॥గీ॥ పీచుపీచను ప్రాణులఁ బ్రేమలేక
గొంతులను గోతురక్కటా క్రూరమతులు
తమ్ము మించిన వారట్లు తమకొనర్చు
వఱకుఁ దద్బాధ నెఱుఁగని వారలగుట॥

జీవహింస పాపంబులకాలయంబనియెఱింగి నిఖిలజీవుల దయార్ద్రబుద్ధిచే నాదరించుటయే కైవల్య ప్రాప్తికి ముఖ్యహేతువగు పరమధర్మంబని తెలియనగుఁగాని పామరుఁడయి

సీ॥ వేకువనే కడు వేడ్కతో నిద్దుర లేచి స్నాతుండైన లేదుముక్తి
అర్ధనిమీలితాబ్జాక్షుఁడై స్ఫటిక మాలికలఁ ద్రిప్పుచునున్న లేదుముక్తి
పట్టుపుట్టముఁ గట్టి ప్రతిచెట్టునకు సాగిలి పుడమిఁ బడినను లేదు ముక్తి
పరువడిదినములు పరమములని కడలినిఁ గ్రుంకుచున్నను లేదుముక్తి

తే॥గీ॥ భూతలంబునఁ దనవలెఁ బుట్టి పెరుగు
నిఖిలజంతుజాలములపై నెనరుఁ గలిగి
తొడరి భూత దయార్ద్ర చిత్తుండు గాక
జీవహింసఁ గల్మషుఁడయి సేయుచున్న॥

వెండియు విషయాసక్తుండు గాక భూతదయా పరుండయి నిశ్చలచిత్తంబున నీశ్వర ధ్యాన పరాయణుండగు వానికి నిర్వాణపదవి లభించుననుటకు సందియము లేదు. అంతియేకాని యింతకుమున్ను మీరన్నటుల

ఆ॥ వె॥ వాలు కనులఁ జూచి వగలాడినడకల
తీరుఁ జూచి మేని సౌరుఁజూచి
చెన్నుమీరుచున్న చిన్నినగవుఁజూచి
మోసపడు జడునకు ముక్తి కలదె?

**2 రు.**—అవునవును, భవదీయ హితోపదేశంబునకు మామనంబు లానందజలధి నోలాడుచుండె.

(తెరలో 'గుభేలు' అని యొక పెద్దధ్వని.)

**2. రు.**— ఏమి యీధ్వని?



1.. రు.— (భయముతో) ప్రళయకాల మేఘగర్జనమో యన్నట్లు పిడుగువంటి యీ ధ్వని యెందుండి వచ్చినది?

2 రు.— ఇట్టి మ్రోఁతను మున్నెన్నఁడును వినియుండలేదు. ఈధ్వని గర్భస్థ పిండంబులకును భీతిఁ గొలుపుచున్నది. (అందఱు తహతహ లాడుదురు.)

2 స.— చంచల హృదయులారా! ఇదియేనా మీ నిశ్చలచిత్తము? తదేకనిష్ఠ గరిష్ఠులకిట్టి తత్తరమేల?

1. రు.— చాలుఁ జాలు, నీగొడవనీకు మాగొడవ మాకు, సర్వపరిత్యాగివగు నీవెట్లైనఁ జలింపకుందువు, కాని మేమీ మ్రోఁతకు హేతువు నరయ వలదా?

(అందఱు దిక్కులఁ బరికించి చూచుచుందురు.)

(తెరలో ధ్వని) 'పట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు.

పౌరులు.—ఆ. అట్లనే కావించెదము(అని యొక్కరినొకరు బిగ్గ కౌఁగిలించుకొందురు.)

(కొందఱు పౌరులు 1 వ సన్యాసి ప్రవేశము.)

1 పౌరు.— ఇదేమి వెఱ్ఱి? ఆసన్యాసిని పట్టుకొనుఁడు

2 రు.— (కౌఁగిలింతలు వీడి) వాని నేలపట్టవలయు?

1 పౌరు.— వానినే పట్టవలయు, నిప్పుడు కలిగిన ధ్వనికి వీరలే కారణంబులు.

1 రు.— వీరెట్లు కారణమైరి?

1 పౌరు.—ఆ సంగతి మనప్రభువు నికటంబున నెఱుకపడఁగ్గలదు.

ముందుపట్టి బంధింపుఁడు (అని సన్యాసుల నీడ్చుకొనిపోదురు.)

## పంచమరంగము.

### కోట్ట.

(ప్రవే.) రుష్యాచక్రవర్తి 1, 2 అధిపులు

చక్ర.— ప్రిథాన యోధులారా, ఇప్పుడు యుద్ధవార్త లెట్లున్నవి?

1 అధి.—దేవా, ఏమిచెప్పుదుము? జాపాన్ వీరులలో నొక్కొక్కఁడు వేలకొలఁది మన సైన్యమును బొట్టను బెట్టుకొనుచున్నాఁడు.

చక్ర.— కానిమ్ము, మెగ్రాఫు పరాక్రమంబున మన సైన్యంబున కొక్కింత జయంబు లభింపఁ గలదు. రణరంగంబున మరణంబులు లేకుండునా?

2అధి.— అయ్యా! ఇంకెక్కడి మెగాఫ్రు, యెక్కడి సరీసాగన్!

చక్ర.—ఆ, యేమి? మెగ్రాఫు సురక్షితముగ లేఁడా?

2 అధి.— లేకేమి? మీను మొసలి తిమింగిలాదుల హృదయ గోళంబులందు మెగ్రాఫు తన పరివారముతో సురక్షితంబుగ నుండెనని మన సిరిల్ ప్రిభువు చెప్ప లేద?

చక్ర.— అకటా, ఎంత ఖేదము

కం॥ ఉగ్రపరాక్రమవంతుల
కగ్రజుఁ డనఁ బేరువడసి యలరారెడి యా
మెగ్రాఫు నంత వానిని
నిగ్రహ మొనరించినట్టి నేర్పరి యెవఁడో॥

చం॥ ఎవరని పల్కఁ నేమిటి కహీనపరాక్రమ విక్రమాన్వితుం
డెవరును గాని వాని కిల నీడగు వారలు లేరు వెండియుఁ
బవరమునందు వాని నిజప్రౌఢిమ మెల్లను శక్తి యుక్తులుఁ
జవమును నేర్పులోర్పులును శౌర్యముఁ జూచియె తీరఁగావలెఁ॥



చక్ర.— ఎవ్వరట్టి వీరుఁడు?

1 అధి.— 'అడ్మిరర్ టోగో' అను విలసిత జగద్విఖ్యాతమూర్తి.

2 అధి.—ఒక టోగో యననేల? జనరల్ నోగి, కురోకి, ఓకు, మున్నగువారెల్లరునట్టి వారె.

1 అధి.— అవునవును, వారికి సమానులు వారేకాని మఱియొకరు లేరు.

చక్ర.— (సక్రోధముగ) ఆ. ఏమీ కావరము?

ఉ॥ వైరులనాదు సన్నిధిని భావ్యమె సన్నుతిఁ జేయ నివ్విధిఁ
వారికి మించు మూర్ఖులును, పందలు, భీరులు, నీచులుండిరే
సారెకు ధీరుఁడౌచు మన స్టాసలెదుర్కొని పోరు సల్పుచో
వారన నెంత? యీ సమర వారిధి ముంచఁగ నెంత? వీనికిఁ॥

ఇరువదివేల సైన్యముతో నేనూరు ఫిరంగులతో "స్టాకల్ బర్గు" అను సేనాధిపతి యేబదెనిమిది కోటలు కలసి దృఢముగనున్న 'ఆర్థరు' కోటకును లక్ష సైన్యము నేనూరు ఫిరంగులనుగొని 'క్యూరోప్యాట్కిన్' అను యోధుని 'లియాంగు' నకును బోయి జాపానుల నెదుర్కొందురు గాక, మఱియు

కం॥ మనవీరు లెందఱెందఱొ
రణవనధిన్మునుఁగ రిపు ఫిరంగులపాలౌ
చును గొందఱీల్గుచుండం
గను మీ రిటులుండ జయము కలుగం గలదే!

కావున స్టాకల్ బర్గు క్యూరోప్యాట్కిన్ ప్రముఖులు తమ సైన్యంబుతో దురమున కరుగఁ బంపుఁడు

1 అధి.— చిత్తము, వారును ప్రయాణ సన్నాహులయి యుందురు.

(అని నిష్క్రమించును.)

చక్రి.— ఏమిది, యీ జన కలకలంబు?

2 అధి.— అధిపా! ఏలాగోకాని కొందఱు పౌరులరు దెంచుచున్నారు.

చక్రి.— రానిమ్ము కారణము విచారింతము

(కొందఱు పౌరులు 1, 2 సన్యాసులు ప్రవేశింతురు.)

1 పౌర.— దేవా! యింతకుముందు జరిగిన పెద్దమ్రోతను వింటిరా?

చక్ర.— వింటిని, ప్రళయకాల మేఘగర్జనము వోలె వినవచ్చిన యామ్రోత యెవరికి వినిపించదు? అందుకు కారణంబేమి?

1 పౌర.— ఈసన్యాసి మన పౌరులకుకొంత వైరాగ్యంబు బోధింపుచుండె జనులెల్లరు వీనినే చుట్టుకొని యుండిరి.

చక్ర.— నిర్మలచిత్తంబున నిర్వాణపదవి కనుగుణ్యంబగు మార్గముపదేశించు వాని జనులు పరివేష్టించి యుండిరన్న నిందు వింత యేమున్నది? తరువాత?

పౌర.— ఈ రెండవవాఁడు వాల్గానదిచెంతఁ గూర్చుండియుండె మేము దవ్వుల నుంటిమి. అంతమాకు గుభేలున యొకధ్వని వినవచ్చె వాల్గాలో నీళ్లు కలకబాఱి వెనుకకు పాఱుచుండె.

చక్ర.— ఏమిచిత్రము, తరువాత?

1 పౌర.— తరువాత మేము వీనిఁజూసి యావారధి సమీపభూమి పగిలి యుండుటఁ జూచి యాధ్వని వీనివలననే కలిగినదని యెంచి వీరి నిటకుఁ గొనివచ్చితిమి.

చక్రి.— వంతెనఁ దెగఁగొట్ట మన శత్రువులు వత్తురు, కాని యన్యుల కేమియవసరము? మఱియు వీరు విరాగులుగ నుండిరె! అయినను వీరెవ్వరో వీరి ముల్లెలవిప్పి పరిశీలింపుఁడు

1 పౌర.— (అట్లొనర్చి) దేవా, వీరిపద్ద కొన్ని రజిత సువర్ణాది నాణెంబులు కలవు అవి కొన్ని సావరనులు నయిదువేల రూకలునై యున్నవి.

(అని చూపుదురు.)



చక్రి.— (రోషముతో) ఇఁకఁదెలిసెఁదెలిసె! ఓయి మీరెవ్వరు?

1 స.— మేము జాపానీయులము.

చక్ర.—

తే॥గీ॥ ఈరు జాపానువారలై యింతయైన
భీతిఁజెందక సన్యాసివేషధారు
లగుచు రిపురాష్ట్రముల కిట్టులరుగుదెంచు
కారణంబేమొ తెలుపుఁడీ కపురయమున॥

1 సన్యా.— మేము వాల్గానదికడ్డముగాఁగల వంతెనను బగులగొట్టవచ్చితిమి కాని కార్యంబు నెఱవేఱలేదు.

చక్ర.— ఓ యోధులారా! దండతాడితోరగంబు కరణి వీరిరాకడ నాకోపాగ్నిఁ బ్రజ్వలింపఁ జేయుచున్నది. వీండ్రిప్ప డేమనుచున్నారు?

2 పౌర.— దేవా! తాము జాపానులమనియు వాల్గావంతెనను దెగఁగొట్టవచ్చితిమనియుఁ జెప్పుచున్నారు.

చక్ర.— ఆ! ఏమి? (రోషముతో)

శా॥ ఔరా!వీరలు సాహసంబునను సన్యాసాకృతిం గైతవా
కారంబు న్ధరియించి యిట్టుల మహాజ్ఞానాత్ములం బోలె యీ
వైరాగ్యంబును బోధసేయుచు వడిం వాల్గాసరిత్స్రోతముం
ధీరత్వంబున నిర్భయత్వమున భేదింపంగ విచ్చేసిరా!॥

(సన్యాసులవంక జూఁచి)

తే॥గీ॥ మీరలు విరాగులేయని మిమ్ముఁజూడఁ
గాఁ దలంచితినేకాని కపటబుద్ధి
బోధసేయుచు నేఁడిట్టి మోసమాచ
రింప నేతెంచి రంచు నూహింపనైతి॥

కానిమ్ము! ఓ కపటపింగులారా! మీ కుటుంబము వారెవ్వరో చెప్పిన మీధనమును వారికి చేర్చెదము. కావున వేగఁజెప్పుఁడు.

2 సన్యా.— రుష్యారాష్ట్రాధిపా!

శా॥ దారాపుత్రుల రక్షణార్థము మహా ద్రవ్యంబు నిండార్లుగా
మా రాజ్యంబున నుండె మా ప్రభువు ప్రేమన్ జూచుమమ్మెప్పుడున్
మీరాష్ట్రస్థిత ద్రవ్యహీనతతికే మేమిత్తు మావిత్తమున్
వారి న్బిల్చియొసంగుఁడీ ద్రవిణమున్ వారల్ మిమున్మెచ్చఁగన్॥

చక్ర.— (తలయూఁచి) ఏమి పల్గెలోభ్రష్టులు! అటులైన నీఁకవినుఁడు.

తే॥గీ॥ ప్రాణములఁగొందు మిపుడీ తుపాకిగుండ్ల
చేతఁ గాన మీచేతముల్ భీతినొంది
మోము లతి వికృతాకారములగుఁగానఁ
గనుల కీ గుడ్డలను వేగఁ గప్పుకొనుఁడు॥

(అని రెండు గుడ్డ లీయఁజూపును)

4 సన్యా.— స్వగతమున

మ॥ భళిరే! వీరితుపాకి గుండులకు జాపాన్ భూరివీరాగ్రగ
ణ్యుల గుండెల్గని భీతినొంది కడునాందోళించు నంచున్మదిన్
బలుమారున్ దలపోసి యీవిధముగా భాషించినారౌర! వీ
రల భీరూభవదంతరంగములు చిత్రంబయ్యెఁ జర్చింపఁగన్॥

1 సన్యా.—పిఱికివారమైన మేమింత దవ్వేలవత్తుము? వచ్చి సఫలమనోరథులమై క్రమ్మరఁ బురికరుగు నుద్దేశ్యము మాకున్నను నది యెాసఁగుటెట్లు?

చక్ర.— (ఆగ్రహముతో)

శా॥ ఓరీకల్మషచిత్త! యోరిఖలుఁడా! యోరీమదోన్మత్త! బల్
కారుణ్యాత్ములవోలె నిట్టి వికృతాకారంబుల న్దాల్చి మీ



గీరీతిన్ భయమింత లేక బళిరే! యేతెంచి యిచ్చోట్టిమం
దౌరా! చావఁగ సాహసించితిర! మూఢాయత్తచిత్తంబునన్॥

మఱియు

ఉ॥ పామరులార! మూఢులయి ప్రాణముల న్విడనాడనుండియున్
వేమరునిట్లు పల్కెడరె బింకముతో హితఁ బౌరుషోక్తులన్
(మోహములనంకెఁజూపి)
ఈమెయి మిన్నకుండుదురె! మహీంతలిఁ గూల్పక యీదురాత్ములన్
ప్రేమనుజూడనేల కడువేగమె కాల్చుఁడు మీతుపాకులన్॥

ఏలయన

తే॥గీ॥ ఈరు మనకపకృతిఁ జేయనెంచి యీరె
యొందనున్నారు తత్ఫలం బొరులకొఱకు
తాముత్రవ్వినగోతులఁ దామెపడుదు
రనెడు సామ్యంబున కిది సాక్ష్యంబుగాఁగ॥

కావున సంకేతస్థలంబునకు వీరి నిరువురఁ గొంపోయి యచ్చోట నిర్ణీతవిధానంబున విగతాసువులఁ జేసిరండు.

1 అధి.— దేవా! వీరు జాపానీయులని మేమెఱిఁగినప్పుడే కర్తవ్యంబునకు సిద్ధమైయుంటిమి. కాని తమయాజ్ఞకై యింతదనుక నిరీక్షింపవలసివచ్చె నిప్పుడదెంతపని? (అని సన్యాసుల నీడ్చికొనిపోదురు.)

(తెరపడును.)

గద్య.

ఇది శ్రీమత్ప్రాలేయాచలజా పాదారవింద
మకరందాస్వాద సానంద హృదయేందిందిర
శ్రీరామన్వయ దుగ్ధపయోధి సుధా
కర గంగయాఖ్య పుత్ర వీరభ
ద్రాహ్వాయ ప్రణీతంబైన
జపానీయమునందలి
తృతీయాంకము.



# జపానీయము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము—గృహము.

(ప్రవే.) జయదాస్, జయరామ్, జయసింగు.

జయదాస్.— సతీతిలకమా! మనకును రుషియనులకు ఘోరయుద్ధంబు జరుగుచుండుటయు, దేశీయులు తదాజికేఁగుటయు వింటివికదా! సమరమున కింటికొక్కరైన రావలయునని చాటుటంజేసి యిట్లరుగుచుండిరి. కావున నేనును వారిఁగలిసికొని బవరమునకేఁగెద.

జయరామ్.— ఓహో నాథా! ఏమిచిత్రము!

కం॥ మీమాటలు వినచోద్యం
బై మానసమునకు తోఁచునట్లయ్యెభువిన్
దామతివృద్ధులుగారే
సామర్థ్యముగలదె రణము సలుపఁగమీకున్॥

జయదాస్.— ఏమిచేయుదు.

ఉ॥ బిత్తరి పౌరులెల్లరును వేడ్క రణంబునకేఁగ నేనునున్
సత్తువబూని శాత్రవులఁ జంపగఁ నేఁగెద నేఁగకున్నచో
మెత్తురెనన్ను! నాకునిదిమేలె! గృహంబున కొక్కరైన గా
నిత్తఱిఁ దప్పకుండజనులేఁగుటఁ గాంచవె యోసతీమణీ॥



జయసింగ్.— జననీ జనకులారా! యుద్ధంబునకుఁ బోవ సిద్ధంబుగా నుండి భవదనుజ్ఞకై నిరీక్షించుచుండు నాకాజ్ఞాపించక తామేల కొందలమందెదరు?

దాస్.—

తే॥గీ॥ పుత్ర నిన్ను యుద్ధమునకుఁ బొమ్మటంచుఁ
జెప్పటకు నోరురాక నేఁ జింతచేత
నిట్లు వచియించితిని గాని వృద్ధునైన
యేను సమరంబునకుఁబోవ నెటుల నేర్తు॥

సింగ్.— జనకా! ఈమాత్రంబునకా!

తే॥గీ॥ ఎఱుఁగరొక్కొ నాకన్నను జిఱుతవాండ్రు
నీడువారును రణమున కేఁగుచుండ
నేల యీలీలఁ దామతి బేలలగుచు
నన్నుఁ బంపక చింతచే నున్నవారు॥

తలిదండ్రులారా! ఆజికేఁగెద, నిదె జోహారు.

దాస్.— విజయోస్తు! విజయోస్తు! నీకతన మేము ధన్యులమైతిమనువార్త రాణమువారికెఱిఁగింపఁ జనెదము.

(అని జయదాస్, జయరామ్ నిష్క్రమింతురు.)

జయసింగ్.— ఆవచ్చువారెవరు? (అని దిక్కులు పరికించును.)

పౌరుఁడు.— (ప్రవేశించి) మిత్రమా! జయసింగ్! యెచ్చోటికి యెందునిమిత్తమై యేఁగుచుంటివి?

జయ.— రణస్థలంబునకు, శత్రువుల నుపకారముఁజేయుటకు!

పౌరు.— శత్రువుల నుపకారము యమపురిఁ జూపుటయా?

జయ.— యమపురిఁజూపుట యపకారముగాని యుపకారముకాదు. నేనట్లు సేయను.

పౌరు.--- మ ఱేమి సేయుదువు?

జయ.—. వీరస్వర్గ సౌఖ్యంబులచే సుఖింపఁ జేయుదు.

పౌరు.— ఓహో! ఇదియా! నీ యుపకారము! కాని.

చం॥ నను నెడ లేక వృద్ధులగు నీతలిదండ్రుల నింటనుంచి నీ
వని కరిగెదంచు నెంచితివ ! యబ్బురమయ్యెఁగనంగ వారికిన్
వినయముఁ బట్టుకొమ్మవలె నాదరణం బొనరించుచుండి యీ
దినమున నిట్లువచ్చుటకు తెల్పుమ హేతువదేమొ మిత్రమా॥

అకటా! వృద్ధులగు నీతలిదండ్రుల విడిచి రానెట్లు కాళ్లాడె?

జయ.—

తే॥గీ॥సఖుఁడ నాపరాక్రమ పౌరుషములె యిటుల
నని కిసన్నిద్ధుఁ జేసి కొనివచ్చె నదియుఁ గాక
ప్రేయసియు వయసుద్దితండ్రి వృద్ధుఁడింటఁ
బనులు కలవంచు మసలంగఁ బాడియగునె॥

పౌరు.—అట్లుకాదు, నామాటవిని నీవింటి కరుగుము, నేను సంగరమున కేఁగెదను.
(అని నిష్క్రమించును.)

జయ.— వీనిమాటలకు మాఱాడఁ జాలక యూరకుంటిఁ గాని యితఁడు నన్నేల వారింపవలె? అకటా! ఇంతకు విజయోత్సాహంబునందు నాకు భాగము లేకపోయెఁ గద! (అని నిష్క్రమించును.)

---

## ద్వితీయరంగము. గృహము.

జయసింగ్, జయదాస్ (ప్రవేశము.)

దాస్.— (స్వగ.) ఏమిది? ఇతండు రణంబుసేయక యిప్పుడే వచ్చు కారణంబరయ రణరంగముఁ జూచి భీతిల్లెఁగాఁబోలు!



ప్రకా. సీ॥ పగవారి రణమునఁ బరిమార్పఁ గాలేక కొంపఁ జేరితె పిల్లికూనయగుచు
వాజిలో భేరిమ్రోయంగ భీతాత్ముండ వగుచు దాఁగితివే దివాంధమగుచుఁ
బరసైన్యమునుజూచి పిఱికి దోఁపఁగఁ బాఱి వచ్చినాఁడవె మదేభంబవగుచు
నెన్నంగ రిపులకు వెన్నిచ్చివచ్చితే యభిమానశూన్యుండవగుచు మఱియు

తే॥గీ॥నని కినీవు తొలుతఁ జనకుండినను గొంత
బాగు కాని యటులనేఁగి మగిడి
వచ్చినావె? నిన్ను మెచ్చుదురే జనుల్
దుర్యశంబు దిశలఁ దోరమయ్యె॥

కుమారా! రణపరాఙ్ముఖుఁడవై యపకీర్తిఁ దెచ్చితివా? రిపులకు వెన్నేల యిచ్చితివి?

సింగ్.— (స్వగ.) ఏమిది! నేవచ్చిన కారణం బరయకయే నా జనకుఁడిట్లుపలుకుచున్నాఁడు? (ప్రకాశముగ)

మ॥ జనకా! యేటికి నన్నుదూర నిటులన్ సత్యంబునుఁ జెప్పెదన్
వినుమా! శాత్రవరాజి భీకరగతిన్ భేదింపఁగా లేక నిన్
గని నే వచ్చితి నంచు నెంచితివ! సత్కారుణ్యమొప్పన్ ననుఁ
గనివారించిరి నాదు ముఖ్య విహితుల్ గాదేని నే వత్తునే!॥

తండ్రీ! నాయుదంతం బాద్యంతంబువినకయే నాపై నేల యాగ్రహించెదరు! అని కేఁకమున్న నాసుహృద్రత్నములు వలదని వారించుటచే వచ్చినాఁడఁ గాని వైరులకు వెన్నిచ్చిరాలేదు.

దాస్.—

ఉ॥ దీన ముఖమ్ము నందుఁగల తేజముఁ గాంచిన నట్లు సెప్పరే!
యేను భయంబు లోఁగదుర నాజికిఁ బోవుటఁగాంచి నీహితుల్
పూనిక వీడి నీపురికి పొమ్మనిరేమొ! య దట్లుకానిచో
మానిత సద్గుణాళి నసమానులునై యిటు లాడ నేర్తురే॥

కుమారా! గంపెడు భయముతో నాహవమున కేఁగు నిన్ను వారింపక పురికో లుపుదురా?

సింగ్.— ఏమీ యీచిత్రము! తండ్రీ!

చం॥ ఎఱుఁగవె నాదు సాహసము నెల్ల నెఱింగియు నిట్టు లాడఁగాఁ
గొఱనడె నొక్కొ! మీకుఁ గల కూరిమి నాపయి నట్లుగానిచో
మఱచితిరొక్కొ! నా నిరుపమాన పరాక్రమ ధైర్య సంపదల్
తఱి యిది కాదఁటన్న విబుధశ్రుతి నమ్మరొ సత్యమాడినన్॥

జనకా! తాము జరాభార శరీరులనియు, భవద్రక్షణార్థమై నే నింట నుంట కర్తవ్యంబు కాని యనిఁ కేగు టుచితంబు కాదనియుఁ బలుకుటచే వచ్చి నాఁడఁగాని రణంబున వెరచి వచ్చినాఁడఁ గాను.

దాస్.— అటులనా? అటులైనను

సీ॥ దేశంబు రిపుల యధీనమా తఱి నీదు తలిదండ్రు లెక్కువే తనయ చెపుమ
తండ్రితరంబున తాతతరంబున నిట్టి దుర్యశము వహించినామె
అపకీర్తిదిశలందు విపులమా తఱి నీదు వైవభంబులచేత ఫలము గలదె
యీడు జోడగువా రనేకులు దురమున క్షభిముఖులౌట నీవరయ లేదె॥



తే॥గీ॥ఇట్టివన్నియు నరసి నీ విటులపురము
మగిడి జేరితివా! నీదు మగతనంబుఁ
గాంచి ప్రశ్నించువారికి ఘనత తోలఁగ
నేమి చెపుదువొ యిపుడె యూహించుకొనుము॥

సింగు.—(స్వగ.) ఇందునకేమి ప్రత్యుత్తరమిత్తు. అన్యత మిందేమికలదు! (అని లోనికి కొంత ప్రవేశించును.)

జయరామ్.— (ప్రవేశించి తనలో) సంగర రంగంబుఁ గాంచి భయాంతరంగుండై రిపులకు వెన్నిచ్చి వచ్చుటంజేసి తండ్రిచే నిందితుండై లజ్జావనతాస్యుండై యిందు నిలుచుండెఁగదా! (ప్రకా.)

సీ॥ బళిరె! సంసారంబుపైనున్న వాత్సల్య మొందు కార్యంబులనుం డఁదగవె!
ముదమెలర్పఁగ దురమునకేఁగి క్రమ్మరవచ్చు కారణమేమి? వర కుమార!
మొదట నేఁగకయున్న నది కొంత బాగేఁగి మగుడివచ్చుటనీకు మానితంబె!
ఇంటనున్నపుడు నాకంటె ధీరుండెవ్వఁడందువె! నీధైర్య మెందు చనియె!

తే॥గీ॥మనుజపశువునుబోలె నీ వనికి బోయి
నీపరాక్రమమును శత్రుభూపు పాలు
చేసి యిచ్చోటఁ గను వూడ్చి జీవనంబు
సేయుటకు వచ్చినాఁడవె సిగ్గులేక!॥

కుమార! ఇఁకఁ జాలుఁ జాలు! నీపరాక్రమము విస్పష్టమయ్యె! నీవు యుద్ధ రంగంబున నలసి సొలసి వత్తువని నీసతీమణి నీకయి యుష్ణోదకంబుల నాయత్తపఱచియుంచెఁ గానఁ బోయి జలకమాడి రమ్ము. ఆవల జింతింపవచ్చును.

(అని నిష్క్రమించును.)

సింగ్.— (స్వగ.) ఆహా! ఇంమనకేమి ప్రత్యుత్తర మీయనోపుదు! తండ్రిగారికొసఁగిన ప్రత్యుత్తరమె యిపుడు నుడివిన నీపెయు నట్లే మగిడి నుడువునా గదా! నేఁ డెంత సిగ్గరితిని. (అని కొంచెము లోనికిఁ బోవును.)

కమల.— (ప్రవేశించి) నాథా! శత్రురాజులఁ జూచి పాఱివచ్చితిరా! అటులయిన

కం॥ నాథా! మీసమెగా కిఁక
భేదంబేమైనఁ గలదె పేర్మిఁ దలఁపఁగా
నీధాత్రి శత్రురాజి, ని
రోధింపఁగలేని నీకు రూఢిగ మాకున్॥

అంతియేకాక

కం॥ పగవారికి వెన్నిచ్చుట
తగునా! తగదా! యటంచుఁ దలఁపక యిటులన్
మగతనము మంటఁ గలిపియు
మగువలవలె వగవనీకు మానిత మగునే॥

చాలుఁజాలు! జరిగినదానికి చింతించినఁ బ్రయోజనమేమి! ఇఁక జలకమాడరమ్ము

జయసింగ్.— (ముందుకువచ్చి) ఆహా! ఏమి వీరి కర్ణకఠోరంపు పలుకులు! ఇవి ములుకులుగాని పలుకులు గావు, అమ్మకచెల్ల! యీపలుకులకెల్ల నేసహింపనొల్ల! రిపులుమమ్ము గెలుతురనునది కల్ల! కావున నిపుడే సమరాభిముఖుండనై యేఁగి పగతురనెల్ల నిక్కంబుగ నొక్కనిముసంబున నుక్కడగించి జయంబుఁగొనివచ్చి వీరిని పరితోషస్వాంతులఁ జేసెద! (భార్యతో) లతాంగీ! నే నని నసమర్థుండనని సమరంబున కేఁగమి యెల్లిదంబు సేయుచుంటివి కదా! ఇఁక నా పరాక్రమముఁ జూడఁ గలవు. (అని నిష్క్రమించును. తెర పడును.)

గద్య. ఇది శ్రీమత్ప్రాలేయాచలజా పాదారవింద
మకరందాస్వాద సానంద హృదయేందిందిర
శ్రీరామన్వయ దుగ్ధపయోధి సుధా
కర గంగయాఖ్య పుత్ర వీరబ్ర
హ్మాహ్వయ ప్రణీతంబైన
జపానీయమునందలి
తృతీయాంకము.



# జపానీయము.

## పంచమాంకము.

### ప్రథమరంగము. (ఆర్దరుకోట)

(ప్రవే.) క్యూరోప్యాట్కిన్, స్టాకల్ బర్గు)

క్యూరో.— వీరసింహమా! నీకిప్పు డిరువదివేల సైన్యము సాహాయ్యంబుగ నుండెఁగద! మఱియు నేబదెనిమిది కోటలుకలిసి యీకోట యేర్పడియె వెండియు నైదు వందల ఫిరంగులచేతను మాయ యంత్రంబులచేతను నేబదివేల సైన్యంబుతో స్టాసల్ చే రక్షింపఁబడుచుండె. నీవును నిందుండి శత్రువుల నిర్మూలంబు చేయుచుండుము. నేను 'లియాంగు'న గాపాడఁబోయెద. (అని నిష్క్ర.)

స్టాకల్.— ఇం దేబదివేల సైన్యంబుతో నేనూరు ఫిరంగులతో స్టాస లుండుటయేగాక నేను నిరువదివేల సైన్యంబుతో నీకోటను గాపాడుచుండెద, నిఁక మమ్మెవరు జయించి యీకోటను స్వాధీనమొనరించుకొందురో చూతము! (అని కోట లోనికేఁగును.)

(ప్రవే.) జయసింగ్, జనరల్ నోగి, సేనాధిపతి, కొంత సైన్యము.

నోగి.— నీవు నాకు సహాయార్థ ముపసేనాధిపతివై యిచ్చోటఁ గడుఁ జాగరూకుఁడవై మెలఁగుచుండుము. నే నీ కోటవెనుకప్రక్క రిపుసేనల రూపుమాపెద. మఱియు మనకు సముద్రమందు 'టోగో' వీరుఁడు సాహాయ్యకారియై యుండుఁగావున సముత్సాహంబున సమరం బొనరింపుచుండుము. నేనుఁ దత్కార్యార్థంబయి యరిగెద. (అని నిష్క్రమించును.)

ఉపసేనాధిపతి.— ఓయభిమానులారా! మహావీరులారా! యిఁక మీ యుత్సాహంబు కొలఁది విజృంభింపుఁడు.

సింగ్.— అధిపా! ఈకోట మిక్కిలి బలిష్ఠమైనదనియుఁ బెక్కండ్రు శూరులచేఁ గాపాడఁబడుచుండెననియు వింటిమికద! కావున నీకోటనే సాధింపవలయు.

ఉపసే.— అవును. కావున మీశక్తియుక్తులఁ బ్రయోగింపుఁడు.

1 సైనికుడు.— దేవా! మనమీకోటను రాత్రివేళ ముట్టడింప నుచితంబని తోఁచుచున్నది.

ఉపసే.— ఏమి! ఇది రాత్రికాదా?

1. సైని.— రాత్రులయం దిట్టి వెలుగుండునా! చూడుఁడు!

(కోటలో వింతయైన వెలుఁగు)

ఉప.— (పరికించి చూచి) వీరులారా!

తే॥గీ॥ బళిరె! కనులకు మిఱుమిట్లు గొలుపునట్లు
వింత వన్నెల కాంతులు వెలుఁగుచుండె
రేయిఁ బగలుగ నీవెల్గు సేయుచుండె
నహహా! కంటిరె శత్రుకృత్యముల నిపుడు!॥

ఈకోటయందు శాత్రవులచే మన మనంబులు విస్మయంబగునటులఁ గాల్పఁబడుచున్న వింతలగు కాంతు లవి మందులుగాని వేఱుకావు. కావున

సా॥ ఈరీమోప్రిల నమేయ సాల నికరంబెల్ల న్బడక్ గొట్టుఁడీ
మీరీవైపున ధీరులౌచు నధిపుల్ మేలంచు మెచ్చ న్నిముక్
వైరుల్ భీతిఁజలించి వెన్నులను జూపక్ సాహసంబొప్ప బల్
ఘోరాకారముగా ఫిరంగుల రిపుల్ గూలక్ వడిక్ గాల్చుఁడీ॥

2 సైని.— ధీరాగ్రేసరా! నేనీ కోటగోడ నొక్క ఫిరంగిగుండు దెబ్బచే ఫెళఫెళమని విరుఁగ గొట్టెదఁ జూడుము. (అని ధ్వనింపించును.)

1 సైని.— నేనీప్రాకారంబును రెండుగుండ్లచే దుత్తునియలుగఁ జేసెదఁ జూడుము. (అట్లు సేయఁబోవును.)



ఉప.— వీరులారా! కొంచె మాగుడాగుఁడు!

1 సైని.— ఆగుటేటికి?

ఉప.—

తే॥గీ॥ పాతి రీ యగడ్తలయందు వాడికలిగి
నట్టి ఖడ్గంబులను మీర లరసినారె!
కల వనేకమాయాయంత్రములును మఱియు
నాటఁబడె ముండ్ల కంచ లీకోటచుట్టు॥

కావున వీటినెల్ల పరికించి జాగరూకులరై మెలఁగుఁడు (కోటలో "ఢం" అను మ్రోఁత)

సింగ్.— ధీరాగ్రణీ!

తే॥గీ॥ వింతవన్నెల కాంతులు వేనవేలు
మెఱుపులటులఁ గోటలపైని మెఱయు కతన
నిలువ నిచ్చోట నొక్కింత నీడ లేదు
పడుచునుండె శిలావృష్టివలెను గుండ్లు॥

మఱియు నీరణరంగం బెంతఘోరంబుగ నుండెనో చూడుఁడు.(కోటలో మగిడి "ఢం" అనుధ్వని)

1 సైని.— అదిగో! మఱల గుండ్లవాన కురియుచుండె.

ఉప.— వైరులు కోటమీఁదనుండి రణమొనర్చుటచే మనకెక్కు డపాయకరముగ నుండెఁ గానిండు. వీరులారా!

ఆ॥వె॥ కాలు తెగినవాండ్రఁ గరము లూడినవాండ్రఁ
గాయమెల్లమిగ్గుల గాయమైన
వాండ్రఁ బ్రాణిశిలేనివాండ్రఁ గాంచిమదిని
ధైర్యమిపుడు వీడఁదగదు మీకు॥

2 సైని.— అయ్యా! మాకిపుడధైర్యమేమి కలదు? మేమిపు డేకోటఁ గూల్చవలయు నోవచింపుఁడు!

ఉప.— కోటలమాటటుండనిమ్ము.

కం॥ నిప్పుల వాన విధంబున
గుప్పుమన ఫిరంగిగుండ్లఁ గుప్పుచుఁ గుప్పల్
గుప్పలుగా రిపుసైన్యము
ని ప్పుడమిని గూల్చుఁడీ యహీన జవమునన్॥

ఎల్లర మొక్కసారిగ ఫిరంగులఁగాల్చి రిపులఁ గూల్చుదము.

(అనిఅటులఁ జేయుదురు.)

ఉప.— (తనసైనికులఁ జూచి) ఆహా! ఎంతసైన్యము నిర్మూలమగు చుండె! (స క్రోధము.)

తే॥గీ॥ కోటపైనుండి మాకేరు సాటిలేరఁ
టంచుఁ గులుకుచున్నారె! ధైర్యంబు తోడ
నొక్కకను తెప్పపాటున కోర్చిమేము
కాల్చు మాఫిరంగుల నిప్డు కాచు కొనుఁడు॥

వీరులారా! ఇదియే సమయము. ఉత్సాహులరగుఁడు. వెనుదీయకుఁడు. ధైర్య మవలంబింపుఁడు. వెండియు.

ఉ॥ ఒక్కెడ మాఫిరంగుల రయోద్ధతిఁ గాల్చుఁడు కోటకూలఁగా
రక్కసి మూకలట్టుల నరాతి వితానము లేయు గుండ్లకున్
గ్రక్కునఁ దప్పుకొంచును పరాక్రమ మొప్ప రణంబొనర్చుచున్
లెక్కకు మించున ట్లరుల లీల ధరాతలిఁ గూలనేయుఁడీ॥

సింగ్.— ధీరాగ్రణీ! కోటను కోటలోని సైన్యమును నిర్మూలమొనర్తుఁజూడుము.



3 సైని.— దేవా! ఇప్పుడు కోటనుండి గుండ్లు ప్రథమమువలెనంతగ వచ్చుటలేదు కారణంబేమి?

ఉప.— శిలావృష్టివోలె మనసైనికులు గుప్పు గొప్పఫిరంగి గుండ్ల తాకుడుచే శత్రుసైన్యము మిక్కుటముగ హతమైయుండవచ్చు నైనను శత్రుశేష ముంచరాదు. కావున కోటలోనికి ప్రవేశించి రణమొనరింతము, రండు.

3 సైని.— అవును, కాని అత్యున్నతంబగు యీకోటగోడ నెక్కు టెట్లు? ఇం దుపకరణంబు లెవ్వియులేవుగద!

ఉప.— మనకిపు డుపకరణంబు లెందుండివచ్చును! మనకు మనమె యుపకరణంబులమై సాహాయ్య మొనరించు కొందము.

3 సైని.— అదెట్లు?

సింగ్.— ఇట్లు (అనితాను కూర్చుండి తనవాపుపై నొకని నెక్కించుకొని లేచి కోటలోనికి చేర్చును. ఇట్లందఱొనర్తురు.)

ఉప.— (మిగిలినవారితో) మీరిచ్చటనుండి కోటగోడఁ గూల్చఁ బ్రయత్నింపుము.

3 సైని.— వీరాగ్రణీ! నేనీకోట గోడ భేదించెదఁ జూడుము (అనితుపాకిఁగాల్చఁదలుపులు వీడును.)

ఉప.— బళీ! బళీ, ఆ పోరు రణవీరుల గాంచుము.

3 సైని.— వీరెల్లరు మనసైనికుల వలెనే కనపించుచున్నారు; కాని వైరివీరులేడ? అదిగో! ఆవచ్చు మన యోధునిచే తెలిసి కొందము

5 సైని.— (ప్రవేశించి) దేవా! నోగియొక్కయు తమయొక్కయు చమూఘాటికోడి శత్రుసైన్యము మితిమీఱి నశించుటంజేసి భీతిల్లి కోటనువదలుటకు స్టాసల్ సమ్మతించుచున్నాఁడు.

ఊప.—ఆహా! ఇప్పటికి కదా! సఫలమనోరథులమైతిమి! యింక నాతనికి తగిన గౌరవమిచ్చి కోటను స్వాధీనమొనరించుకొందము రండు.

(అని అందఱు కోటలోనికి ప్రవేశింతురు.)

(తెరపడును)



## ద్వితీయరంగము.

### అరణ్యము. (ప్రవేశము.) వాచాలుఁడు.

వాచా.— (భయముతో) అహా! ఎంతఘోరమెంతఘోరము! ఇట్టిదారుణయుద్ధము నే చరిత్రయందైనను మఱి యెచ్చోటనైనను విని కని యుంటిమా! హాయిగ కడుపులోనిపాలు కదలకుండునటుల నుండక యేమో పర్యవసాన మరయఁగోరి చెట్టుఁగొట్టి పైవేసికొనినట్లుల గుట్టనక పుట్టనక యిట్టి ఘోరాటవులఁ దిరుగు టేటి విలాసము! ఏటి విహారము! ఈ యుద్ధమింతటితో నాగకుండిన మహోపద్రవము వాటిల్లుననుటకు సంశయములేదు. ఇప్పటికే కలిగిన నష్టము పారముగ నుండెను. మఱియు నింతటితో మా పాదంబులకు వచ్చినదారి నడువ ననుజ్ఞ నిచ్చుటయే యుక్తమని తోఁచుచున్నది. కాని మా పాంచాలుఁడేడి! (దృష్టి నిగిడించి) ఆవచ్చునది పాంచాలుఁడేన! (అనిచూచుచుండును.)

పాంచా.— (ప్రవేశించి) ఏమటులఁ జూచుచున్నావు?

వాచా.— మఱేమియులేదు. నీ సాహస ధైర్యాదులకు నివ్వెరపడి యిటులఁ జూచుచున్నాఁడను.

పాంచా.—ఇందు నా సాహస ధైర్యాదులేమికలవు? విజయాభిలాషులై పోరువారివి కాక పరులవిషయ మిందేమికలదు?



వాచా.— అవును. కాని యిట్టి ఘోరాహవముఁ జూచుటకు గొంత ధైర్యమలవడి యుండవలెనని నాయభిప్రాయము.

పాంచా.—నిశ్చయము. తదన్యులీ సమర విషయముల వినఁనైనఁ జాలరనుట తథ్యము.

వాచా.— ఈ పలుకు లిప్పుడుగదా నీ నోటినుండి వెలువడినవి! నే నిట్లాడిన నెంత పరిహాసింతువో! కాని నేనిఁక ధైర్యము నిలుపఁజాలను.

పాంచా.— పరిహాసమేటికి? ఇట్టి దారుణయుద్ధ మెందును గానము.

తే॥గీ॥ నాల్గులక్షల పడుచువాం డ్రీల్గి రకట!
యెందఱో స్త్రీ లనాథలై గుందుచుండి
రుభయ రాష్ట్రంబులకు నష్టమొదవెఁ జాల

వాచా.—
నేమికానున్నదో! ముందు నిటులనున్న॥

పాంచా.— ఇంకేమియులేదు. ఇరుదెగలవారును సంధికొడంబడిరి.

వాచా.— (ఆతురతతో) ఎట్లెట్లు? చెప్పుము!

పాంచా.— కొరియామీఁది స్వాతంత్ర్యము "చాంగ్చిక్" మొదలు పోర్టార్థరు వఱకుఁ గల రైలు, లియోటాంగు యొక్క గుత్తయు, "సెఘేలియన్" ద్వీపములో సగభాగమును, జపానువారి స్వాధీనమగునటులఁ బరిష్కరింపఁబడినది.

వాచా— ఈసంధి యెచ్చట జరిగినది?

పాంచా.— అమెరికాలోని "పోర్టుస్మత్" నగరమున.

వాచా.— అటులైన యమెరికావారె యీసంధి నొనఁగూర్చిరా!

పాంచా.— అవును. అమెరికా ప్రసిడెంటగు "రూజ్వెల్టు" గారు జరుగుచున్న కల్లోలంబుల నివారింప నెంచి పందొమ్మిదివందల యైదవ సంవత్సరము ఆగస్టు నెల యిరువదిమూడవ తేది నిరుకక్షుల ప్రతినిధుల జేర్చి సంధియొనర్చిరి. ఇందునకు రుష్యా జపాన్ ప్రభువు లిరువురు నొడంబడిరి.

వాచా.— జపానువారోడంబడిరన్న నాశ్చర్యమేమున్నది! అన్నివిధముల వారికి మేలుగనే యుండెఁగదా! ఎంతచెట్టునకంతగాలి యను లోకోక్తి యుభయులకును నష్టముపట్ల సరిపోయిన దనుకొన్నను లాభముపట్ల మాత్రము వ్యతిరేకమైనది. ఇట్టి జయమునకు కారణభూతుఁడెవఁడో!

పాంచా.— "రామాయణమంతయు విని రావణునకు సీత ఏమికావలె" నన్నట్లు జపానునకు కొరియాకు నడుమ గల "త్సుషిమా" జలసంధిలో రుష్యావారి యిరువదిరెండునావలను నాలువేల సైనికులను సముద్రమునముంచి, యెనిమిదివేల సైనికులను, పదినావలను, నిరువుర ముఖ్యసేనాధిపతులను, జేఁబట్టుకొనిన "అడ్మిరల్ టోగో" కాక మఱింకెవరు కలరు!

వాచా.— ఆహా! సకలజనసంస్తూయమగు వాని నావికానైపుణ్య మెంత వర్ణనీయము!

పాంచా.— వాని నైపుణ్యముకన్న వానికి నావికావిద్యఁ గఱపినవారి నైపుణ్య మెక్కుడు వర్ణనీయము కాదా!

వాచా.— అదియు నిశ్చయమే!

పాంచా.— అటులైన బ్రిటిషువారును బ్రశంసనీయులె!

వాచా.— సత్యము! సత్యము! సంతోషంబయ్యె నిఁకపోవుదమా!

పాంచా.— జపానుల విజయోత్సవమును గాంచి పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

### జపాన్కోర్టు.

(ప్రవేశము) చక్రవర్తి, ఒయామా, టోగో, 1 అధిపతి.

చక్ర.— అపారపారావారపరీతమహీతలంబున నిట్టి నిస్తులకీర్తివిభాసితుడ నగుటకు భవాదృశయోధవరులయొక్కయు నీ మనపౌరులయొక్కయు వాత్సల్యమే కదా కారణంబు!



టోగో.— దేవా! మావిధికాక మేమొనర్చిన యతిశయమేమియు లేదు!

ఒయామా.— అదియుఁ దమ కారుణికత్వమె!

1 అధి.— నిశ్చయము! మఱియు

కం॥ దైవాజ్ఞగ రాజాజ్ఞను
భావించి యొనర్ప శిరముపై నిడుటయె సం
భావితమగుఁ గా నటుగా
కేవిధిమెలఁగినను గలుగదే యెఘ మనఘా॥

ఈ నమ్మికయే మాయొక్కయు మన పౌరులయొక్కయు రాజభక్తి విశ్వాసాదులకు ముఖ్యకారణము.

## భరతవాక్యము.

ఉ॥ శ్రీకరులై మహీపతు లశేషజనంబుల బిడ్డలట్లుగా
లోకము నేలుగాత! జనులున్ దమయేలికలన్ విధేయతన్
జేకొని తండ్రులట్టుల భజింతురుగాత! ప్రజానురాగ మ
స్తోకముగాఁగ వర్ధిలుత! క్షోణియు సస్య సమృద్ధిఁ గాంచుతన్॥

### గద్య

ఇది శ్రీమత్ప్రాలేయాచలజా పాదారవింద
మకరందాస్వాద సానంద హృదయేందిందిర
శ్రీరామన్వయ దుగ్ధపయోధి సుధా
కర గంగయాఖ్య పుత్ర వీరబ్ర
హ్మాహ్వయ ప్రణీతంబైన
జపానీయమునందలి
పంచమాంకము.

సంపూర్ణము.



